# రామాయణ పాత్రలు



రచన

శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు





ప్రచురణ

జయప్రద పబ్లికేషన్సు

మచిలీపట్నం - 521 001

ప్రథమ ముద్రణ : రౌద్రినామ సంవత్సరం ది 24-3-1980
ద్వితీయ ముద్రణ : దుందుభినామ సంవత్సరం ది 15-6-1982
ప్రతులు : 3000
మూల్యము : రు. 6-00

ముఖచిత్రం : శ్రీ మద్దాలి వెంకట శేషగిరిరావు, మచిలీపట్నం


ముద్రణ : త్రివేణి ప్రెస్, మచిలీపట్నం

---

Paper used for the printing of this book was made available by the Government of India at concessional rates through the Convener & Director of A. P. Govt, Text-Book Press, Hyderabad. We are grateful to the authorities.

—PUBLISHERS

---

# విషయసూచిక

పేజీ

# శ్రీరామ రక్షా స్తోత్ర రత్నమ్

శ్రీరామ రామ రఘునందన రామ రామ
శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ
శ్రీరామ రామ రణకర్కశ రామ రామ
శ్రీరామ రామ శరణంభవ రామ రామ

రామ రామ తవ పాద పంకజం
చింతయామి భవబంధ ముక్తయే
వందితం సుర నరేంద్ర మౌళిభిః
ధ్యాయితం మనసి యోగిభిః సదా

లోకాభి రామం రణరంగధీరం
రాజీవనేత్రం రఘువంశ నాథం
కారుణ్య పాత్రం కరుణాకరంతం
శ్రీరామచంద్రం చరణం ప్రపద్యే

# కృతజ్ఞతలు

1980 మార్చిలో 'రామాయణ పాత్రలు' మొదటిసారిగా ముద్రించినాము. ఆంధ్రప్రజానీకం మన్ననలేగాక యితర రాష్ట్రములలో నున్న తెలుగువారి ప్రశంసలను కూడ అందుకున్నది దిన వార పత్రికలు ప్రశంసించినాయి. Director of Public Librarie$_s$ వారు Approve చేసి Citation No. 3523 / తె 200 / 846 కూడ యిచ్చినారు, వారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకమునకు 'ఆముఖము' పేరిట పరిచయ వాక్యములను వ్రాసిన 'మధురభారతి' శ్రీ మల్లాప్రగడ శ్రీ రంగారావుగారికి హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు. బాల బాలికలను తీర్చిదిద్దాలనే తలంపుతోను, సచ్ఛీల సాహిత్యమును రూపొందించాలనే పరమావధితో ఉత్తమసాహిత్య పుస్తకాలను ఆంధ్రప్రజానీకానికి అందివ్వాలని సంకల్పించుకున్నాము. మా ప్రయత్నానికి కొంత ప్రోత్సాహం లభించడం వలన రెండవ ముద్రణకు సాహసించాము. పోయిన నెలలో 'వివేకవాణి' అను ఉత్తమ బాలసాహిత్య పుస్తకమును కూడ రెండవసారి ముద్రించినామని తెలియబరచుటకు ఎంతగానో సంతసించుచున్నాము. పెదబాలశిక్షకు తుల్యమైన 'బాలవిజ్ఞానకోశము' అను బాలల పుస్తకమును కూడ ఆంధ్రప్రజానీకానికి సమర్పించుకున్నాము.

ముద్రణ రేట్లు, కాగితం రేట్లు రోజురోజుకు పెరుగుతున్న తరుణంలో పుస్తకాలను ముద్రించడం అంత తేలిక గాదు. అందులో ఉత్తమశ్రేణికి చెందిన పుస్తకాలను ముద్రించడం నిజంగా సాహసమే అవుతుంది. పుస్తకాల వెల కూడ అధికంగా పెట్టడం లేదు. ధనార్జన మా ఆశయం కాదు. ఉత్తమ సాహిత్య ప్రచారం మా పరమావధి. మా ఆశయ సాధనకు తోడ్పడుతున్న మిత్రులకు, అభిమానులకు, విద్యాలయముల గ్రంథాలయముల నిర్వాహకులకు మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను తీసుకొని రావడానికి concessional rates కు తెల్లకాగితమును సప్లయిచేసిన Convener & Director of A. P. Government Text-Book Press, Hyderabad వారికి మా ప్రత్యేకమైన కృతజ్ఞతాభినందనలు. ఈ పుస్తకమును చక్కగా ముద్రించి (ద్వితీయ) యిచ్చిన 'త్రివేణి' ప్రెస్‌వారికి మా కృతజ్ఞతలు. ఉత్తమ సాహిత్య ప్రచారానికి భవిష్యత్తులో కూడ తెలుగుప్రజల అండదండలు వుంటాయని విశ్వసిస్తున్నాము.

భవదీయ

మచిలీపట్టణము
15-6-1982

(సం) కొమరగిరి కృష్ణమోహనరావు
ప్రొప్రయిటర్, జయప్రద పబ్లికేషన్స్

# ముందుమాట

ఆశావాది ప్రతిక్షణంలోను ఒక అవకాశాన్ని చూస్తాడు. బాధలో సౌఖ్యాన్ని పొందుతాడు. చెడులోనుంచి కూడా మంచిని చూడగలుగుతాడు. కటికచీకటిలోకూడా వెలుగుకోసం అన్వేషణ కొనసాగిస్తాడు. ఆశావాది చెట్టుకు వున్న ముండ్లను లెక్కచేయడు. అతను చూచేది చక్కగా వికసించిన గులాబీలను మాత్రమే.

నిరాశావాది దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తాడు. అతనికి ఆత్మవిశ్వాసం వుండదు. ధైర్యం అసలే వుండదు. ఏమాత్రం కొద్ది ఆపద ఎదురైనా ఎదుర్కొనే శక్తి వుండదు. కష్టాలను చూచి కన్నీరు కార్చేస్తాడు. బాధలను చూచి భయపడిపోతాడు. అటువంటి బలహీన మనస్తత్వంగల వారిలో ఎల్లప్పుడూ నిరాశ, నిస్పృహలు తాండవిస్తుంటాయి. అట్టివారికి అన్నీ అపజయాలే ఎదురవుతుంటాయి.

కష్టమూ-సుఖమూ; బాధ-సౌఖ్యమూ అనేవి వేరే ఎక్కడా వుండవు. మన మనస్సులలోనే కాపురం చేస్తుంటాయి. దృఢసంకల్పులు అన్నింటినీ సమానంగా చూడగలుగుతారు. అట్టివారికి అంధకారంలోకూడ కాంతిరేఖ కవిపిస్తుంది. ఆత్మవిశ్వాస శూన్యులకు పట్టపగలే చిమ్మచీకటిగా తోస్తుంది. ప్రపంచంలో ఏ ఆశయం, ఏ ఆదర్శం అయినా బాధలు, యాతనలు అనుభవించకుండా సాధించబడలేదు. బాధలను నవ్వుతూ, నవ్వుతూ ఎదుర్కొనడం వలన, త్యాగంచేయడంవలన ఎవడూ, ఎప్పుడూ, ఏమీ కోల్పోడు. పైపెచ్చు శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను పొందగలుగుతాడు.

స్వామి వివేకానంద ఒక ఉపన్యాసంలో "కొండను ఎలుక ఏమీ చేయదు. అదేవిధముగా నన్ను కష్టాలు ఏమీ చేయలేవు అని నిశ్చలంగా భావించగలవారే జీవితాన్ని ఎదుర్కొన గలరు" అని అంటాడు.

ఇదే వాస్తవాన్ని, యథార్థాన్ని రామాయణ మహాకావ్యంలోని పాత్రలు మనకు బోధిస్తున్నాయి. వారు ప్రదర్శించిన మనోధైర్యం, ఆశయసాధనకోసం వారు పడిన కష్టాలు, ఆదర్శంకోసం వారు చేసిన త్యాగాలు, ధర్మాన్ని నిలబెట్టడానికోసం వారు చేసిన కృషి, దుష్టశిక్షణ, శిష్టరక్షణకోసం వారు ప్రదర్శించిన బలపరాక్రమాదులు, పవిత్రశీలమును కాపాడుకొనుటకు సీతాదేవి పడిన అష్ట కష్టాలు మానవజాతికి స్ఫూర్తి ప్రదాయకములు.

రామాయణం, మహాభారతం, భగవద్గీత వంటి ఉత్తమ గ్రంథాలను చదివే మహద్భాగ్యమును నాకు పరమేశ్వరుడు ప్రసాదించాడు. 1975 వ॥ జూన్

నుంచి 19 నెలలపాటు రాజమండ్రి సెంట్రల్ జైలులో డిటెన్యూగా వుండే అదృష్టం నాకు లభించింది. అంతటి తీరుబడి జీవితంలో లభించడం అదే ప్రప్రథమం. రాజకీయ కార్యకలాపాలలో నిర్విరామంగా తిరిగేటటువంటి నాకు, అంతటి విరామం లభించడం కొంచెం యిబ్బందిగానే తోచింది. "పనిలేనివాని బుర్ర దయ్యాల కొంపతో సమానం" అనే సామెతలోని యథార్థం, వాస్తవం, ఆ రోజులలో నాకు బాగా అర్థమైంది. బుర్రకు ఏ పనీ చెప్పకుండా ఖాళీగా వుంచితే, చెడు ఆలోచనలకు అవకాశ మిచ్చినవార మవుతాముగదా! అందువలన ఆ విరామ సమయాన్ని సద్వినియోగంచేయ సంకల్పించుకున్నాను.

జీవితం చాలా విలువైనది, అందులో మానవజీవితం అత్యంత అమూల్యమైనది. గతించిన కాలం మళ్ళీ కావాలన్నా తిరిగి రాదు. కాలం వృథా పరచడం విజ్ఞుల లక్షణం అంతకన్నా కాదు. కనుక ఆ విరామ అవకాశాన్ని భగవంతుడు ప్రసాదించిన ఒక వరప్రసాదంగా భావించి, అమూల్యమైన కాలాన్ని సద్వినియోగం చేయ సంకల్పించుకున్నాను.

ఈ జీవితంలో సాధించవలసిన అమూల్యమైన విషయాలు ఎన్నో వున్నాయి. ఏదో ఒకటి సాధించినంత మాత్రంలో సంతృప్తి జెందరాదు. ఎంత సాధించినా సాధించవలసినది, నేర్చుకోవలసినది యింకా ఎంతో వున్నదనే నగ్నసత్యాన్ని విస్మరించరాదు. ఆ యథార్థాన్ని గుర్తించాను. మంచి విషయాలను తెలుసుకోవాలనే ఆకాంక్ష నాలో జనించింది. మంచి పుస్తకాలకోసం అన్వేషణ ప్రారంభించాను. మనస్సు పరుగులు పెట్టింది.

రాజాజీ రామాయణం చదివాను. కొంత మనశ్శాంతి కల్గింది. డా. మల్లాది గోపాలకృష్ణశర్మగారు రచించిన 'రామాయణ వైభవం' ఏకాగ్రతతో పఠించాను. ఉత్సాహం వెల్లువికింది. శ్రీ బి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు రామాయణంమీద యిచ్చిన ఉపన్యాసాలను చదివాను. స్ఫూర్తి నిచ్చాయి. వాల్మీకి రామాయణమును తెలుగులోనికి తర్జుమా చేసిన శ్రీ శ్రీనివాస శిరోమణిగారి పుస్తకాలను చదివాను. ధైర్యం వచ్చింది. సంస్కృత పండితులు శ్రీ సూరి సుబ్రమణ్యంగారు సంస్కృత "సుందరకాండ"ను చదివి చక్కగా విడమర్చి చెప్పారు. ఆత్మవిశ్వాసం కల్గింది. సంకట పరిస్థితులు సంప్రాప్తమైనప్పుడు, కష్టాలు బాధలు వచ్చి మీదపడినప్పుడు రామాయణంవంటి మహాకావ్యం చదివితే మనశ్శాంతి లభించే మాట వాస్తవం. అంతేకాదు, ఉత్సాహం, సాహసం, ధైర్యం, శక్తి, సద్బుద్ధి, స్ఫూర్తి, ఆత్మవిశ్వాసములు కూడా కలుగుతాయి.

నాకున్న కొద్ది పరిజ్ఞానంతో, ఆ రామాయణ పుస్తకాలను చదివి కొన్ని మంచి విషయాలను గ్రహించగలిగాను. గ్రహించినది, నేర్చుకున్నది యితరులకు చెప్పినప్పుడే అది రాణిస్తుంది. ఆ అమూల్యమైన విషయాలను కొన్నింటిని నా భార్యా పిల్లలకు వ్రాయాలని సంకల్పించుకున్నాను. నా భావాలకు ఒక రూప కల్పన యివ్వాలని నిశ్చయించుకున్నాను. నేను దూరమైనానని బాధపడుతున్న నా భార్యా పిల్లలకు, యీ ఉత్తరాలు కొంత మనశ్శాంతిని చేకూరుస్తాయని భావించాను.

రామాయణంలో నాకు ఆరు పాత్రలు బాగా నచ్చాయి. శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు, భరతుడు, హనుమంతుడు, సుమిత్ర పాత్రలు నన్నెంతో ఆకర్షించినాయి. వారు ప్రదర్శించిన ఓర్పు, ఓర్మి, సహనాలు, చేసిన త్యాగం, చూపిన ధైర్య సాహస బలపరాక్రమాదులు, వా రనుసరించిన ధర్మనిష్ఠలు నన్ను మంత్రముగ్ధునిగా చేసాయి. అటువంటి మహానుభావులను ఆదర్శంగా గైకొని జీవితాలను సరిదిద్దుకోగలిగితే ప్రపంచం సుఖశాంతులతో విలసిల్లుతుంది. ధర్మం నాలుగు పాదాల నడుస్తుంది.

అందువలన వారి వ్యక్తిత్వాల గొప్పతనాన్ని గురించి లేఖలలో వివరించాను. వారు సాధించిన మహత్తర విషయాలను, వా రనుసరించిన ధర్మపథమును, కష్టాలను ఎదుర్కొనడంలో వారు చూపిన ధైర్యము, ఆత్మ స్థైర్యములను గురించి విడమరచి, ముఖ్యముగా పిన్నలకు కూడా అర్థమయ్యే విధముగా లేఖలను వ్రాసాను. నా తల్లిదండ్రులు, సోదరులు, నా శ్రీమతి మరియు చిరంజీవులు వాటిని చదువుకొని ఎంతో సంతోషించారు. ఇంకా అనేక విషయాల మీద ఎన్నో ఉత్తరాలు వ్రాసాను. నేను ఎదురుగా లేకపోయినప్పటికి, ఉత్తరాల ద్వారా రామాయణ పాత్రల ఆదర్శాలను, నా భావాలను చదువుకొని ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పొందారు.

కారాగారంనుంచి బయటకు వచ్చిన తరువాత ఆ ఉత్తరాలకు ఒక స్వరూపం యివ్వాలని భావించాను. ఆ సంకల్ప ఫలితమే " వివేకవాణి. " అది నా ప్రథమ రచన. నా ద్వితీయ ప్రయత్నం ఈ " రామాయణ పాత్రలు. " ' వివేకవాణి ' పుస్తకమును చదివి, మెచ్చి నన్ను ఉత్సాహపరచిన పాఠక లోకము, శ్రీరామనవమి సందర్భమున విడుదల చేస్తున్న యీ ' రామాయణ పాత్రలు ' పుస్తకానికి కూడా అందిస్తారని. ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

కొమరగిరి కృష్ణమోహనరావు

# ఆ ము ఖ ము

'ఆర్ష విద్యా భూషణ',
'మధుర భారతి'
మల్లాప్రగడ శ్రీరంగారావు

"వేదవేద్యేపరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా."

వేదములచే తెలియబడు పరమాత్మ దశరథుని కుమారుడుగ దివినుండి భువికి దిగివచ్చినపుడు వేదము వాల్మీకి మహర్షినుండి రామాయణ రూపమున వెలువడినది.

ఆద్యకవియగు శ్రీ వాల్మీకి మహర్షి విరచితమైన శ్రీ మద్రామాయణ మహాకావ్యము ఆర్షవాఙ్మయమునకు శ్రీకారమై, సర్వప్రపంచ ప్రజానీకమునకు ధర్మోద్దీపకమై, నీతిదాయకమై, వేదరహస్యార్థప్రబోధకమై మహోపకార మొనర్చి మహోజ్జ్వల మణివలె విరాజిల్లుచున్నది.

అందుచేతనే శ్రీమద్రామాయణము ఆదికావ్యమై భారతీయుల జీవన స్రవంతిలో ప్రధాన స్థాన మాక్రమించినది.

"ధర్మమార్గం చరిత్రేణ, జ్ఞాన మార్గంతునామతః
తథాధ్యానేన వైరాగ్యం, ఐశ్వర్యం స్వస్యపూజనాత్ ॥

అను వ్యాసమహర్షి సూక్తి ననుసరించి ధర్మమార్గానుగామియగు శ్రీరామ చంద్రుని పవిత్ర చరిత్ర అన్నివర్గాల వారికి ఆదర్శమై నాటినుండి నేటివరకు సర్వప్రపంచ ప్రజలకు అనుసరణీయమైనది. ఇట్టి రామాయణగ్రంథ మందలి కొన్ని ప్రధాన పాత్రలను పరిశీలించి వారి స్వరూప స్వభావములతో పాటు ఆదర్శమగు వారి ఆచరణ విధానమును కూడ శ్రీయుతులు కొమరగిరి కృష్ణ మోహనరావుగారు నేటి యువతకు మననయోగ్య మగునట్లు సులభ శైలిలో "రామాయణ పాత్రలు" పేర ఆంధ్రుల కందించినారు.

ఇంతకు పూర్వమే వీరు 'వివేకవాణి' గ్రంథమును వెలయింపజేసి భారతీయాధ్యాత్మిక సంపత్తిని సంపాదించుటకై వలయు విధానము, విద్యా పరమార్థములను వివరించి జిజ్ఞాసువులకొక అమూల్యమగు కానుక నందించిరి. రామాయణ కావ్యమున పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, భాతృవాత్సల్యము, శరణాగత రక్షణ తత్పరత, ఏకపత్నీవ్రత నియమము, ప్రజానురంజకత,

వ్యవహారకౌశలము, సత్య, దయా, వినయ, గాంభీర్యాది సద్గుణముల ప్రభావము నిరూపింపబడినవి.

శ్రీరామచంద్రునిలో పైన చెప్పిన గుణము లన్నియు మూసపోయబడి మూర్తీభవించి యున్నవి. కనుకనే 'రామో విగ్రహవాన్ ధర్మః' అని వశిష్ఠు డంతటి మహర్షి ప్రశంసించెను.

శ్రీరామాయణ కథలోని పాత్ర లన్నియు సాంఘిక జీవనము, కుటుంబ జీవితము ప్రశాంతముగ సాగించుటకు ఆదర్శములై మన కన్నులముందు కన్పడుచుండు నిత్యమూర్తులు.

శ్రీ కృష్ణమోహనరావుగారు ఆ యా పాత్రల పరిశీలనాంశములందు ప్రధానమైనవి పేర్కొనుచు నేటి మానవజాతికి నిత్యజీవితములో అవసరమై, ఆచరణీయములగు సన్నివేశములను చక్కగ వివరించినారు.

'ధర్మార్థగుణ విస్తరం సముద్రమిక రత్నాఢ్యం, సర్వశ్రుతి మనోహరం' అయిన రామాయణములోని పాత్రల ధర్మశ్రద్ధను, నైతిక బలమును, సాంఘిక నియమములను అద్దములోవలె ప్రతిబింబింపచేసిన యీ రచయిత సుకృతి. శ్రీరాముని పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, భ్రాతృవాత్సల్యము, సీతాదేవి పాతివ్రత్యము, లక్ష్మణుని భ్రాతృసేవాపరాయణత, భరతుని స్వార్థత్యాగము, భ్రాతృగౌరవము, అంజనేయుని ప్రభుభక్తితో కూడిన దాస్యభావగరిమ, సుమిత్ర హృదయమందలి పవిత్రభావన యీ గ్రంథమున సోదాహరణముగ వివరింపబడినవి. ఇంకను సుగ్రీవుడు, శత్రుఘ్నుడు, విభీషణుడు మొదలగువా రెందరో రామాయణమున కన్పడుదురు. వారిని గురించి వివరించిన గ్రంథ బాహుళ్యమగు ననియో, అణిముత్యములవంటి ఆదర్శములను ఆరుగురు పాత్రలద్వారా విశదీకరించితిమిగదా యనియో రచయిత వారిని ప్రస్తుతము ప్రస్తావించలేదు. అన్నదమ్ముల అపారమైన ఆదరణ, అభిమానము, ఆప్యాయత శ్రీరామ సోదరు లందరియందు కన్పడును. శత్రుఘ్నుడు కూడ లక్ష్మణ భరతులవలె అనన్యమైన భ్రాతృభక్తికలవాడుగ యీ క్రింది ఘట్టములు స్పష్టము చేయును.

భరత శత్రుఘ్నులు తండ్రి మరణముచే దుఃఖితులైనపుడు భరతునితో శత్రుఘ్నుడు పలుకుచు

"గతిర్యః సర్వభూతానాం దుఃఖేకిం పునరాత్మనః
సరామః సత్య సంపన్నః స్త్రియాప్రవ్రాజితోవనమ్"
"బలవాన్ వీర్య సంపన్నో లక్ష్మణో నామ యోప్యసౌ
కిం నమోచయసే రామం కృత్వాపి పితృ నిగ్రహం"

సర్వప్రాణులకు ఆధారభూతుడైన శ్రీరాముడు భార్యతో కూడ అరణ్యముల పాలగుట భరింపరాని దుఃఖము. పరాక్రమవంతుడగు లక్ష్మణుడు దగ్గర వుండి కూడ తల్లిదండ్రులను విగ్రహించి శ్రీరామ వనవాసమును ఏల మాన్పింపలేకపోయెనని బాధపడెను.

శ్రీరామ రాజ్యపాలనా సమయమున మహర్షులు లవణాసురుని బాధలు భరింపజాలక శ్రీరామునితో మొరపెట్టుకున్నప్పుడు లవణ సంహారార్థము భరతుని పంపించదలచిన శ్రీరామునితో శత్రుఘ్నుడు.

"శయానో దుఃఖ శయ్యాసు నందిగ్రామే మహాయశాః
ఫలమూలాశనోభూత్వాజటీ చీర ధర స్తథా
అనుభూయేదృశం దుఃఖ మేష రాఘవ నందనః
ప్రేష్యేమయిస్థితే రాజన్ న భూయః క్లేశమాప్నుయాత్."

నందిగ్రామములో దర్భశయ్యపై పరుండి కందమూలములు తినుచు జటాధారియై అనేక కష్టము లనుభవించిన భరతుని నే నుండగా లవణాసుర యుద్ధమునకు పంపి అన్నకు శ్రమను కలిగించుట పాడిగాదని పలికి తానే పయనమైన భ్రాతృ గౌరవ భాజనుడు.

లవణాసురుని సంహరించి వచ్చిన శత్రుఘ్నునికి శ్రీరాముడు మధురా నగర రాజ్యమును పాలింపుమని ఆజ్ఞాపింపగా అతడు సిగ్గుతో "కథం తిష్ఠత్సు జ్యేష్ఠేషు కనీయానభిషిచ్యతే." 'నాకంటె పెద్ద లుండగ నా కేల యీ రాజ్యాభిషేక' మని తన త్యాగభావమును, అన్నల యందలి గౌరవమును వెల్లడించెను. అంతేగాక 14 సంవత్సరములు శ్రీరాముని వియోగ దుఃఖమును పొందిన నాకు మరల యీ వియోగమును కల్పింప వలదనియు. తల్లిలేని శిశువువలె నిన్ను విడిచి యెక్కువ కాలము వేరొకచోట వసింపజాల' ననియు పలుకుచు

"ద్వాదశైతాని వర్షాణి త్వాం వినా రఘునందన
నోత్సహే యమహం వస్తుం త్వయా విరహితోనృప ॥
మాతృహీనో యథా వత్సో నచిరం ప్రవసామ్యహం"

అని శ్రీరామునితో తన రామ వియోగ వ్యథను స్పష్టము చేసెను.

శ్రీరామచంద్రుడు తన యవతార సమాప్తము గావింప దలచి నపుడు శత్రుఘ్నుడు తన కుమారులకు రాజ్య మప్పగించి రామసన్నిధి కేతెంచి

„ తవానుగమనేరాజన్ విద్ధి మాం కృతనిశ్చయం నచాన్యదద్యవ క్తవ్యమవోసీరవ శాసనమ్. " ' మీ వెంటవచ్చుటయే నా ధర్మము. మీ యనుగమనమే నాకు శరణ్య ' మని శ్రీరామభక్తిని, సేవాకైంకర్యమును వెల్లడించుకొనిన భ్రాతృభక్తి తత్పరుడు. మర్యాదా పురుషోత్తముడగు శ్రీరామచంద్రుని యుత్తమ గుణము లెన్నియో కలవు. కృతజ్ఞుడు, ధర్మజ్ఞుడు. వీర్యవంతుడు, జితక్రోధుడు, సర్వ భూతహితుడు, దృఢవ్రతుడు. ఏకప్రియదర్శనుడు మొదలగు సుగుణముల పుంజమే శ్రీరాముడుగ మనకు స్పష్ట మగును,

శ్రీరామ సుగ్రీవ మైత్రి అనన్య సామాన్యమైనది. ఆ మైత్రికి ధనిక దరిద్ర భావములు, గుణదోషముల ప్రతిబంధకములు కావు. వాల్మీకి మహర్షి కిష్కింధ కాండములో మైత్రిని ప్రశంసించుచు

" అఢ్యోపివా దరిద్రోవా దుఃఖితస్సుఖితోపివా
నిర్దోషశ్చ సదోషశ్చ వయస్యః పరమాగతిః "

అనియు, స్వార్థత్యాగ బుద్ధితో ఒకరికొకరు సమర్పణమునకు సిద్ధపడుటయే పవిత్ర మైత్రికి లక్షణ మనియు

" ధనత్యాగ స్సుఖత్యాగో దేశత్యాగోపివానఘ
వయస్యార్థేవవర్తంతే స్నేహందృష్ట్వాతథా విధమ్ "

అని పలికెను. కబంధుని వలన సుగ్రీవ సామర్థ్య మెరిగిన శ్రీరాముడు ఋష్యమూక పర్వతప్రాంతముల కేగినపుడు ఆంజనేయుడు తన రాకను దెల్పుచు ధర్మాత్ముడగు వానర శ్రేష్ఠు డొకడు తన యన్నచే భార్యా పరిభ్రష్టుడై ప్రపంచ మంతయు సంచరించుచున్నాడు. అతని మంత్రినగు నన్ను హనుమంత దందురు. మా ప్రభువైన వానరరాజు మీ మైత్రి నభిలషించుచున్నా " డని పలుకగ లక్ష్మణుడు ఆంజనేయునితో " గురుర్మేరాఘవస్సోయం సుగ్రీవం శరణంగతః. " 'నా ప్రభువైన శ్రీరాముడు కూడ సుగ్రీవుని శరణు కోరుచున్నా ' డనెను. రామ లక్ష్మణులను సుగ్రీవుని యొద్దకు తీసుకొని పోయి హనుమంతుడు సుగ్రీవునితో చెప్పగా వానరరాజు

" రోచతేయదిమే సఖ్యం బాహురేష ప్రసారితః
గృహ్యతాం పాణినాపాణిః మర్యాదాబధ్యతాంధ్రువా."

' నా స్నేహము కోరినచో నా యీ చాచిన హస్తమును గ్రహించి మైత్రి మర్యాదను నిలుపు ' మని పలికెను.

అప్పుడు రామ సుగ్రీవులు అగ్నిసాక్షికమగు మైత్రీ బంధమును పొంది శాశ్వత మైత్రీ సూచకమగు ధర్మమును నిరూపించిరి. అంతట సుగ్రీవుడు శ్రీరామునితో

"త్వం వయస్యోఽసి హృద్యోమేహ్యేకం దుఃఖం సుఖం చనౌ
సుగ్రీవో రాఘవం వాక్య మిత్యు వాచ ప్రహృష్టవత్."

'మన సుఖ దుఃఖములు ఏకమే. ఒకరి దుఃఖమును, సుఖమును మరి యొకడు తనదిగ భావించుటయే మన మైత్రికి చిహ్న' మని పలికెను.

"సోహం సభాజ్యో బంధూనాం సుహృదంచైవ రాఘవః
యస్యాగ్ని సాక్షికం మిత్రం లబ్ధం రాఘవ వంశజమ్."

'శ్రీరామా! రఘువంశ సంజాతుడవైన నీవంటి వానితో మైత్రిని పొందిన నేను నా బంధు మిత్రులలో గౌరవమును పొందుదు' నని శ్రీరాముని శ్లాఘించెను.

సీతా రామ లక్ష్మణులు నందిగ్రామమునకు వెళ్ళి భరతుని చూచినపుడు అంతకుముందే ఆంజనేయుని వలన జరిగిన వృత్తాంతమును వినిన భరతుడు ప్రక్కనున్న సుగ్రీవుని కౌగిలించుకొని

"త్వ మస్మాకం చతుర్ణాంతు భ్రాతా సుగ్రీవ! పంచమః
సౌహృదా జ్జాయతే మిత్ర మపకారో ఽరిలక్షణమ్."

'సుగ్రీవా! నీవు మా సోదరులు నలుగురికి ఐదో సోదరుడవు. నీ మైత్రి నీ యుపకారముచే స్థిరమైనదని నిరూపించితి' వని మెచ్చుకొనెను.

ఈ రచయిత శ్రీరామ భరతుల మైత్రి, శ్రీరామ లక్ష్మణుల మైత్రి చక్కగ వివరించి అన్నదమ్ముల ఆదరాభిమానములు నేటి కాలాని కాదర్శ ప్రాయములని నిరూపించిరి.

భరతుడు చిత్రకూటమునకు వెళ్ళి శ్రీరాముని అయోధ్యకు రాజువుకమ్మ అని ఎంతగానో ప్రార్థించును.

"ఏభిశ్చ సచివైస్సార్థం శిరసా యాచితో మయా
భ్రాతుశ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి."

'శ్రీరామా! ఈ మంత్రు లందరితో కూడ మేము నిన్ను ప్రార్థించు చున్నాము. ఈ దాసుని కోరిక తీర్చి నీవు రాజ్యమును పాలింపు'మని శ్రీరాముని

పాదములకు నమస్కరించెను. చివరకు శ్రీరాముడు తన పాదుక లిచ్చి రాజ్యమును పాలింపుమని భరతునితో పలికినపుడు

"చతుర్ధ శేతు సంపూర్ణే వర్షే ఒ హని రఘూత్తమ !
నద్రక్ష్యామి యదిత్వాంతు ప్రవేక్ష్యామి హుతాశనం."

'రామా ! ఈ పదునాలుగు వత్సరములు నిండిన మరునాడు నీ దర్శనము కానిచో అగ్నిప్రవేశము చేసెద' నన్నాడు. ఆహా ! ఏమి భరతుని భ్రాతృభక్తి. కౌసల్యతో భరతుడు తనకు రాజ్యకాంక్ష వున్నచో అనేక పాపఫలములను పొందెదనని కొన్ని శపథములు పలుకను. ఆ శపథముల ద్వారా వాల్మీకి మహర్షి యే యే పనులు చేసినచో ఎట్టి పాపములు సంభవించునో లోకమునకు తెలియపరచుచు భరతుని భ్రాతృభక్తి, గౌరవమును, అతని రాజ్య త్యాగ దీక్షను ప్రకటించెను. అయోధ్యకాండలోని భరతుడు చేసిన శపథ వాక్యములు ప్రతి మానవుడు తెలిసికొన దగినవే.

శ్రీరాముడు లక్ష్మణునియందు అధికమైన వాత్సల్యము గలవాడు.

"నచతేన వినానిద్రాంలభతే పురుషోత్తమః
మృష్టమన్నము పానీతం అశ్నాతినచతంవినా,"

లక్ష్మణుడు లేకుండ శ్రీరాముడు నిద్రపోడట. అన్నము తినడట. అట్లే భరతునియందును వాత్సల్యమును చూపెను.

రావణ సంహారానంతరము విభీషణుడు శ్రీరాముని తన ఆతిథ్యమును స్వీకరించి ఒక్కనాడు తనతో మండవలసినదని ప్రార్థించినపుడు విభీషణునితో శ్రీరాముడు, "తంతుమేభ్రాతరం ద్రష్టుం భరతంత్వరతేమనః" 'భరతుని చూచుటకై నా మనస్సు త్వరపడుచున్నది. ముందు నందిగ్రామమునకు పోవలయు' నని పలికెను. భరతునిపై రాముని వాత్సల్య మట్టిది.

సీతాదేవి, అగ్నిప్రవేశ సమయమునందును. హనుమంతునికి లంకా దహన సమయమున అగ్నిదేవుడు శాంతించుగాక యని పలుకునపుడును ఆమె చేసిన ప్రతిజ్ఞా వాక్యములు నారీలోకమునకు అమూల్య రత్నములు.

"యథామే హృదయం నిత్యంనాపసర్పతిరాఘవాత్
తథాలోకస్య సాక్షీమాం సర్వతఃపాతుపావకః."

'నా హృదయము నిత్యము శ్రీరామునియందు లగ్నమైనచో అగ్నిదేవుడు నాకు సాక్షియై నన్ను రక్షించుగాక !"

" యద్యస్తి పతి శుశ్రూషాయద్యస్తిచరితం తపః
యదిచాస్త్యేక పత్నీత్వం శీతోభవ హనూమతః "

'నేను పతిసేవ చేసినదాననైతే, తపము చేసినదాననైతే పతివ్రత నగుదునేని హనుమంతునికి అగ్నిహోత్రుడు చల్లబడుగాక!' ఇట్టి వెన్నియో కలవు.

సాధుహృదయులగు శ్రీ కృష్ణమోహనరావుగారు ధర్మ రత్నములకు, నీతి రత్నములకు ఆకరమైన రామాయణ మహాసాగరమున మునకలువేసి అనర్ఘ రత్నములను వెలికితీసి వాటి దివ్యకాంతులను విస్తరింపచేసిరి. ప్రసిద్ధ ఘట్టములందలి "రామం దశరథం విద్ధి........", "నా హం జానామికేయూరే" వంటి ప్రధాన శ్లోకములను ఉదహరిస్తూ బాలల హృదయాలకు హత్తుకొనునట్లు ధార్మిక, నైతిక సారాంశములను బోధపరచిరి.

వీరి పాత్ర పరిశీలనా పద్ధతి రామాయణమును సమగ్రముగ పఠింపలేని వారికి చాల ప్రయోజనకరమేగాక రామాయణ మంతటిని చదువవలయునను ఆసక్తి కలిగించును. అమరభాషలోని రామాయణ పాత్రల పవిత్ర చరిత్ర ఆంధ్రుల హృదయమున స్థిరముద్ర అగునట్లు యీ రచయితచేసిన కృషి ప్రశంసనీయము. ఇట్టి గ్రంథమును పాఠ్యగ్రంథముగ ప్రభుత్వము నిర్ణయించి ధర్మదీప్తిని, నైతిక బలమును బాలబాలికలకు కలిగించుట మిక్కిలి యవసరము, అశాంతి తాండవిస్తున్న ఆధునిక కాలమున ప్రశాంతతను కలిగించే పవిత్ర పాత్రల ప్రవర్తన, సంభాషణ అందరికి సంస్మరణీయమే.

" యశ్చ రామం న పశ్యేత్ యంచరామో న పశ్యతి
నిందిత స్సభవేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే."

ఎవడు శ్రీరాముని చూడడో, ఎవనిని శ్రీరాముడు చూడడో వాని జన్మ వ్యర్థమను మాట ఈ గ్రంథము చదివిన వారికి స్పష్టము కాగలదు.

ఇట్టి భారతీయ సంప్రదాయ ప్రతిబింబితములగు మరికొన్ని గ్రంథములను రచించి యీ రచయిత తాను తరించుచు లోకమును కూడ తరింపచేయాలని మావంటి వారి అభిలాష. ధన్యజీవనులైన యీ రచయితకు ఇతోధిక శక్తి సామర్థ్యములు దైవము ప్రసాదించుగాక! ఆబాలగోపాలము ఈ గ్రంథమును చదివి ఆనందము పొందగలరనుట అతిశయోక్తికాదు. ప్రతివారి జీవితములు ఇందు కన్పడుటచే అవశ్యము. అందరు పఠించి జీవిత పరమార్థమును అందు కొందురు గాక!

" భద్రంనో భూయాత్ "

మల్లాప్రగడ శ్రీరంగారావు

" యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం వాఽపి మానద
భవేన్మమ సుఖం కించి ద్భస్మ తత్కురుతాం."

" భరతుడుగాని, శత్రుఘ్నుడుగాని, నీవు ( లక్ష్మణుడు ) గాని లేకుండగ నేను ఎట్టి యల్పమగు సుఖమును కోరినను అగ్నిహోత్రుడు దానిని భస్మము చేయుగాక !"

— శ్రీరామచంద్రుడు

" శీలం ప్రధానం లోకేఽస్మిం స్తస్మిం త్సర్వం ప్రతిష్ఠితమ్
శీలేన సర్వ మాప్నోతి యత్కించి న్మనసేచ్ఛతి
క్రియా శ్శీలవిహీనస్య భవంతి విఫలాః కృతాః
తస్మా చ్ఛీలవతా భావ్యం పురుషేణ విజానతా."

ఈ లోకములో శీలమే ప్రధానమైనది. దాని పైననే సమస్తము ఆధారపడి యున్నది. మానవుడు శీలము ద్వారా ఏది కావలెననుకొనిన దానినే పొందగలడు. శీలవిహీనుని యొక్క కర్మలన్నియు వ్యర్థము లగును. కావున వివేకియగువాడు శీలమును పరిరక్షించుకొనవలెను."

— విష్ణుధర్మోత్తర పురాణము

" శుశ్రూషా మేవ కుర్వీత భర్తుః ప్రియహితే రతా
ఏష ధర్మః స్త్రియా నిత్యో వేదే, లోకే శ్రుత స్స్మృతః "

పతివ్రతయగు స్త్రీకి భర్తృ శుశ్రూష కంటె వేరొక ధర్మము లేదు. స్త్రీకి పతి శుశ్రూషయే ( సేవయే ) వేద, లోక స్మృతి సమ్మతమగు ధర్మము.

— శ్రీరామచంద్రుడు

" పున్నామ్నో నరకా ద్యస్మా త్పితరం త్రాయతే సుతః
తస్మా త్పుత్త్ర ఇతి ప్రోక్తః పితౄన్యః పాతి సర్వతః "

పుత్రు డనగా తండ్రిని 'పు' న్నామకమగు నరకమున పడకుండగ రక్షించువా డనియు, తండ్రిని సర్వవిధముల కాపాడువా డనియును అర్థం.

— శ్రీరామచంద్రుడు

" నతు ధర్మోపసంహార మధర్మఫలసంహితమ్
తదేవ ఫల మన్వేతి ధర్మశ్చాఽధర్మనాశనః "

" ధర్మము ధర్మఫలమును అనుసరించును. అధర్మము అధర్మఫలమును అనుసరించును. కావున నీవు ఉత్తరకాలమందు చేసిన ఈ యధర్మము, పూర్వ కాలమందు చేసిన ధర్మమును నశింపజేసి యధర్మమునే నీ కిచ్చును.

— హనుమంతుడు

# రామరాజ్య వైభవము - వైశిష్ట్యము

" న పుత్రమరణం కించిత్, ద్రక్ష్యన్తి పురుషాః క్వచిత్
నార్యశ్చావిధవా నిత్యం, భవిష్యన్తి పతివ్రతాః
నచాగ్నిజం భయం కించిత్, న్నాప్సు మజ్జన్తి జన్తవః
న వాతజం భయం కించిత్, న్నాపి జ్వరకృతం తథా
నచాపి క్షుద్భయం తత న తస్కరభయం తథా
నగరాణి చ రాష్ట్రాణి, ధనధాన్యయుతాని చ
నిత్యం ప్రముదితా స్సర్వే, యథా కృతయుగే తథా "

" తల్లిదండ్రులుండగ పుత్రులు మరణించేవారు కాదు. స్త్రీలు విధవలయ్యేవారు కాదు. అగ్నివలనగాని, వరదల వలనగాని, గాడ్పులవలనగాని రోగభయముగాని, ఆకలి చావులు గాని, దొంగల భయముగాని వుండేది కాదు. దేశము ధన ధాన్యములతో విలసిల్లుతూ కృతయుగమునందువలె యావన్మంది ప్రజలు రామరాజ్యంలో సుఖ సంతోషములతో జీవించారు.

రామరాజ్యంలో ధర్మం నాలుగుపాదాల విలసిల్లుతుండేది. కరువు కాటకాలు వుండేవి కావు. క్షామదేవత ప్రవేశానికి అవకాశం లభించేది కాదు. అవినీతికి అసలే అవకాశం లేదు. మోసం, దగా అంటే వారికి తెలియదు. ప్రజలు సుఖ శాంతు లతో జీవితాన్ని గడిపారు. అందువల్లనే మనకు స్వాతంత్ర్యం లభించిన వెంటనే మహాత్మాగాంధీజీ "రామరాజ్యాన్ని తిరిగి నెలకొల్పటమే నా జీవిత పరమావధి" అని చెప్పారు. రామ

రాజ్య వైభవాన్ని, వైశిష్ట్యాన్ని బాగా బాపూజీ అవగాహన చేసుకొనినందువల్లనే అటువంటి 'రామరాజ్యాన్ని' పునః ప్రతిష్ఠించడమే తన కర్తవ్యంగా భావించారు.

రామాయణ మహాకావ్యపు పేరుప్రతిష్ఠలు క్రీస్తు శకారంభమునకు పూర్వమే జావా, సుమిత్రా మొదలగు సుదూర ద్వీపములకు వ్యాపించినదని చరిత్రకారులు పేర్కొన్నారు. రామాయణముయొక్క దేశాంతర ప్రశస్తిని గురించి ప్రముఖ చరిత్రకారుడు డా. వి. రాఘవన్ "ఈ మహాకావ్య ప్రాశస్త్యము మన దేశ ఎల్లలకే- అయోధ్య నుంచి రామేశ్వరానికి, లంకకు మాత్రమే పరిమితంకాక, ఆగ్నేయాసియా అంతటనూ వ్యాపించింది. లావోస్, వియత్నాం, కాంబోడియా, థాయ్‌లాండ్, మలేషియా, ఇండోనేషియా దేశాల ప్రజలను పరవశుల జేసింది. మహోజ్జ్వల నాట్య, నాటక శిల్పాలలో అత్యంత రమణీయంగా, శోభాయమానంగా విలసిల్లి పేరుప్రఖ్యాతుల నందుకున్నది" అని వ్రాశాడు.

ఇండోనేషియా పరిపాలకులు మతంరీత్యా ముస్లిములు అయినప్పటికి కొలది సంవత్సరాలకు పూర్వం "ప్రపంచ రామాయణ మహాసభలు" అక్కడి ప్రభుత్వ ఆధ్వర్యముననే నిర్వహించబడటం విశేషం. ఆ దేశంలో పామరులు సహితం చూచి సంతోషించే విధముగా 'రామాయణ గాథ' ను తెలియబరచే ప్రదర్శనలు, నాటకాలు ఈనాటికీ ఎంతో రమణీయంగా నిర్వహించబడుతున్నాయి. రష్యావారు సహితం వాల్మీకి రామాయణ మహాకావ్యమును తమ భాషలోనికి అనువదించారు.

ఈ మహాకావ్య వైశిష్ట్యమును గురించి ప్రముఖ జర్మన్ పండితుడు వింటర్‌నిడ్జ్ "ఈ రామాయణము, మహాభారతము వలె యావద్భారతజాతియొక్క సర్వస్వమై వెలయుచున్నది. శతాబ్దముల తరబడిగ జాతియొక్క విచారధారను, కావ్యప్రపంచ

మును యింతగా ప్రభావిత మొనర్చిన మఱియొక కావ్యము ప్రపంచమున నే సాహిత్యముననూ కానరాదు. భారత దేశము లోని అన్ని తరగతులకు చెందిన ప్రజలలో ఈ మహాకావ్యము వేలాది సంవత్సరా లయినప్పటికి జీవించి వుండగలదు. గొప్పవారు-తక్కువవారు ; ధనవంతులు-పేదలు ; రాజు-రైతు ; వణిజులు, వివిధ వృత్తులచే జీవించువారు-ఆబాలగోపాలము-అందరకును ఈ మహాకావ్యములోని కథలు, ఇందలి పాత్రలు సుపరిచితములు" అని పేర్కొన్నాడు.

రామాయణం ఆదికావ్యం. అది ఒక సంస్కృత వాఙ్మయము నకే గాక, సర్వ వాఙ్మయములకును అది ఆది కావ్యమే. భారతీయ కుటుంబ జీవితమును గురించి, సత్సంప్రదాయములను గురించి, ఉన్నతంగా, సమగ్ర సుందరంగా చిత్రించిన మహాకావ్యము ఇది. ఈ మహాకావ్యములోని వివిధ పాత్రల ఆదర్శ జీవితాలు, వారి నడవడి, నైతిక విలువలు అత్యున్నతములు. ఇది పఠించినచో లోకము నందలి సాంఘిక ప్రవృత్తిని సమగ్రంగా అవగాహన చేసుకొన వచ్చును. తండ్రి యెడల పుత్రుని కర్తవ్యం, భార్యా భర్తల అన్యోన్య ప్రేమ, పాతివ్రత్య మహిమ, భక్తుని భక్తి శ్రద్ధలు, మిత్రత్వంయొక్క గొప్పతనం, శత్రువులతో వ్యవహరించవలసిన విధానము, సోదర ప్రేమ ఔన్నత్యము—యింకా అనేక అమూల్య విషయాలు ఈ మహాకావ్యంలో సందర్భోచితంగా వివరించ బడ్డాయి. సమాజము-వ్యక్తి ; రాజు-ప్రజ ; భార్యా-భర్త ; కుటుంబం-అందలి సభ్యులు ; ప్రభువు-సేవకుడు మరియు సోదరులు-మిత్రులు మధ్య పరస్పర ముండవలసిన సంబంధ బాంధవ్యాలు, కట్టుబాటులు ఈ మహాకావ్యంలో పేర్కొనబడినాయి. పరిపాలకులు పాటించవలసిన సామాజిక ధార్మిక కర్తవ్యములు, వా రనుసరించవలసిన నైతికాచరణము, వా రనుష్ఠింపదగిన ఆధ్యాత్మిక సంబంధమైన విషయాలు ఎన్నో చక్కగా, సమయోచితంగా

నిర్దేశించడం జరిగింది. వివిధపాత్రలమధ్య సంఘర్షణలకు తావివ్వకుండా పాత్రలకు జీవం పోసి, పోషించి, చైతన్యాన్ని కలుగజేసి, క్రమబద్ధమైన సమాజమునకు అవసరమైన ఆదర్శములను ప్రసాదించి, లోకకళ్యాణమునకు, విశ్వశాంతికి దోహదం యిచ్చే పాత్రలు సృష్టించిన ఘనత రామాయణ మహాకావ్య రచయిత వాల్మీకి మహర్షికే దక్కింది.

పితృవాక్యపరిపాలన పుత్రుల కర్తవ్యమని, అది అత్యంత పరమోత్కృష్టమైన ధర్మమని పదునాలుగు సంవత్సరాలు వనవాసం చేసి నిరూపించాడు శ్రీరామచంద్రుడు. సకల భోగ భాగ్యములను త్యజించి, భర్తతో కానలకేగి, అనేక కష్ట నష్టముల కోర్చి, భర్త ననుసరించడం ఒక్కటే సతుల ధర్మమని ఋజువు చేసింది సీతాదేవి. తన అనుంగు ప్రియురాలిని, జన్మ నిచ్చిన తల్లిని వదలి అన్నయగు శ్రీరాముని వెంట అరణ్యాలకు వెళ్ళి భ్రాతృ ప్రేమను ప్రపంచానికి చాటిన త్యాగశీలి లక్ష్మణుడు. అవకాశం వచ్చిందికదా యని స్వార్థంతో రాజ్యాధికారాన్ని స్వీకరించక, శ్రీరాముని పాదుకలకే పట్టాభిషేకం చేసి అయోధ్యను వదలి, నందిగ్రామంలోనే మకాం పెట్టి, సకల రాజభోగములను త్యజించి, నారబట్టలను మాత్రమే ధరించి, కందమూల ఫలములను మాత్రమే ఆరగిస్తూ, రామప్రతినిధిగా పదునాలుగు వత్సరాలు రాజ్యపాలనచేసి, రాజ్యాన్ని తిరిగి శ్రీరామునికి వప్పగించిన నిస్వార్థ త్యాగశీలుడు భరతుడు. సేవా ధర్మమును స్వీకరించి, ప్రతిఫలాపేక్ష లేకుండా ఆచరించి, అనుసరించి దాని గొప్పతనాన్ని ప్రపంచానికి చాటి చూపించిన నిష్కల్మష హృదయుడు, ప్రభు భక్తి పరాయణుడు హనుమంతుడు. స్నేహితు లేవిధముగా ఒకరి కొకరు సహాయభూతులై, కష్టకాలంలో కూడ దూరం కాకుండా సహకరించుకుంటూ అన్యోన్యతతో జీవితయాత్రను కొనసాగించాలో ఆచరించి ప్రపంచానికి చూపించిన ఆదర్శ

స్నేహశీలి సుగ్రీవుడు. కొడుకు యెడల గల మమకారాన్ని సహితం వదలుకొని, ధైర్యాన్నిచ్చి, కర్తవ్యాన్ని ప్రబోధించి, లక్ష్మణుని శ్రీరామునితో అడవులకు పంపిన ధీశాలి, ఆదర్శ మాతృమూర్తి సుమిత్ర. భర్తకు దూరమైనందుకు విచారిస్తూ అతిభయంకరులైన రాక్షస స్త్రీలు పెట్టే బాధల ననుభవిస్తూ, లోకకంటకుడైన రావణుని హుంకరింపులకు భయపడక, లాలింపులకు తలయొగ్గక, తన పవిత్ర శీలమును కాపాడుకుంటూ, పాతివ్రత్య మహిమను ప్రపంచానికి చూపించిన సాధ్వీమణి సీతాదేవి. ఇదే విధముగా అనేక ఉత్తమ పాత్రలను సృష్టించి, జీవంపోసి, చైతన్యాన్ని కలుగజేసి ప్రపంచానికి అత్యున్నతమైన మహాకావ్యమును ప్రసాదించిన మహనీయుడు వాల్మీకి మహర్షి.

ఈ కావ్యములో ప్రతినాయకుడుగా సృష్టించబడిన రావణుడుగూడ సాధారణ పురుషుడు కాదు. అతి బలపరాక్రమ సంపన్నుడు. సకలవిద్యాపారంగతుడు. అతని మహత్తర శక్తి ముందు అనంతమగు ప్రకృతియే మోకరిల్లినది. అతని తేజము ముందు దేవేంద్రాది దిక్పాలకులే నిస్తేజులైనారు. అతని పేరు స్మరించినంత మాత్రముననే సకల చరాచరకోటి హడలిపోయేది. అతని ఐశ్వర్యమునకు అంతులేదు. అతడు అనంత శక్తి సంపన్నుడు. అతని లంకాపురి సువర్ణభూమి, భోగ భూమి. సకల భోగ భాగ్యములతో విలసిల్లు తుండేది. హనుమంతు డంతటి వాడు అతని శక్తిని చూచి నివ్వెరపోయి "అతని యందు అధర్మము లేకుండిన యెడల, అతడు సర్వలోకము లను రక్షించగల మహాసామర్థ్యముగల శక్తి సంపన్నుడు. పర స్త్రీ వ్యామోహం అతనిలో లేకుండినచో అతనిని ఓడించగల శక్తివంతుడు త్రిలోకములలో వుండేవాడే కాదు" అని రావణుని శక్తి సామర్థ్యములను చూచి హనుమంతుడు ఆశ్చర్యచకితుడై చెబుతాడు. పరస్త్రీలను చెరబట్టటువంటి చెడు ఉండటం

వల్లనే అతడు పతనమైనాడు. అతనిని లోకకంటకుడుగా సమాజం భావించింది. చెడు ఒకప్రక్క ఉన్నపుడే మంచితనం ప్రభావిత మవుతుంది. దానిలోని గొప్పతనాన్ని ప్రజలు బాగా అర్థం చేసుకొన గలుగుతారు. చెడు-మంచిల మధ్య తారతమ్యాన్ని గుర్తించగలుగుతారు.

ప్రజలను పెడత్రోవన పట్టించకుండా, సక్రమ మార్గాన నడిపించడానికి వాల్మీకి మహర్షి చేసిన కృషి ఫలించింది.

ఇటువంటి ఆదర్శవంతమైన మహాకావ్యం ప్రపంచంలో మరెక్కడా కనుపించదు. వేల సంవత్సరాలైనప్పటికి ప్రజల హృదయాలలో శాశ్వతంగా స్థిరమైన స్థానాన్ని ఆక్రమించుకొనిన ఘనత రామాయణ, మహాభారతాలకే దక్కింది. అటువంటి పవిత్ర గ్రంథాలను పఠించి అవగాహన చేసుకొని, అర్థం చేసుకొని, వాటిలోని పవిత్ర ఆశయాలను ఆచరణలో పెట్టినప్పుడు మాత్రమే మనం మన ధర్మానికి న్యాయం చేకూర్చినవార మవుతాం.

**" పుణ్యము కాని, పాపము కాని తాను అన్నమాటకు కట్టుబడి పనిచేసి పెట్టేవాడు వీరుడు పురుషోత్తముడు. స్నేహము చేసి స్నేహితులచేత తమ పని చేయించుకొని ప్రత్యుపకారము చేయనివాడు కృతఘ్నుడు. ఆ కృతఘ్నుడు చచ్చిపోతే వాడి కళేబరాన్ని కుక్కలు, నక్కలు వాసన కూడా చూడవు. "**

**" ఒక కోటిమంది కొడుకులను కనిపెంచడంకన్నా పెనిమిటిని ఒక్కణ్ణి అనుసరించి మెప్పించడమే ఆడుదాని ధర్మము. అంతకన్నా అధికము అయిన ధర్మము ఆడుదానికి మరి ఒకటి లేదు.**

**—శ్రీ శ్రీనివాస శిరోమణి రామాయణం నుండి**

# 2

## శ్రీరామచంద్రుడు

---

“ ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ
బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శ్శత్రునిబర్హణః
విపులాంసో మహాబాహుః కమ్బుగ్రీవో మహాహనుః

మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః
ఆజానుబాహు స్సుశిర స్సులలాట స్సువిక్రమః
సమ స్సమవిభక్తాఙ్గ స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః

ధర్మజ్ఞ స్సత్యసన్ధ శ్చ ప్రజానాం చ హితే రతః
యశస్వీ జ్ఞానసమ్పన్న శ్శుచి ర్వశ్యస్సమాధిమాన్
ప్రజాపతిసమ శ్శ్రీమాన్ ధాతా రిపునిషూదనః
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా

రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా
వేదవేదాఙ్గతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ స్స్మృతిమాన్ ప్రతిభానవాన్
సర్వలోకప్రియ స్సాధు రదీనాత్మా విచక్షణః

సర్వదాఽభిగత స్సద్భిః స్సముద్ర ఇవ సిన్ధుభిః
ఆర్య స్సర్వసమ శ్చైవ సదైకప్రియదర్శనః
స చ సర్వగుణోపేతః కౌసల్యానన్దవర్ధనః
సముద్ర ఇవ గామ్భీర్యే ధైర్యేణ హిమవానివ

విష్ణునా సదృశో వీర్యే సోమవ త్ప్రియదర్శనః
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమ
ధనదేవ సమ స్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః
త మేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్"

(శ్రీరామచంద్రుని ప్రశస్తములైన గుణములను గురించి నారద మహాముని వాల్మీకి మహర్షికి వివరించిన శ్లోకములు.)

ఇక్ష్వాకువంశమున జన్మించిన వారిలో శ్రీరామచంద్రుడు మిక్కిలి ప్రసిద్ధుడు. లోకము లన్నింటిని జయించగల సర్వశక్తి సంపన్నుడు. లోకమర్యాదను కాపాడుటకు అవతరించిన పురుషోత్తముడు. కామ క్రోధాది శత్రువులను అణచగల సమర్థుడు. ఆశ్రితులను, బంధువులను రక్షించే సామర్థ్యంగల మహా బలసంపన్నుడు. శత్రువులను హతమార్చగల మహావీరుడు. తెలివిగలవాడు, నీతిగలవాడు, బుద్ధి వివేకము గలవాడు. వేద వేదాంగ తత్త్వజ్ఞుడు. కీడుచేసిన వారికి సహితం మేలు చేయగల విశాల హృదయుడు. ఆపదలు సంభవించినను చలింపని వజ్ర కఠోరమైన మనస్సు గలవాడు. సమస్త శాస్త్ర సిద్ధాంతములు సాకల్యముగా తెలిసినవాడు. ధర్మనిష్ఠాగరిష్ఠుడు. ధనుర్వేద విద్యయందు మంచి నైపుణ్యం గలవాడు. ధర్మరక్షణ పరాయణుడు. శరణాగత రక్షకుడు, సర్వలక్షణ సంపన్నుడు. సత్యసంధుడు. రాజనీతి కోవిదుడు. ప్రజానురంజకుడు. విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది. గాంభీర్యమున సముద్రుడు. ధైర్యమున హిమవంతుడు. ఓర్పున భూదేవితో సాటియైనవాడు. వీర్యమున విష్ణువుతో సమానుడు. చంద్రునివలె చూచుటకు ప్రియమైన వాడు. త్యాగంలో దధీచితో సమానుడు. సత్యమున ధర్మ దేవత. కోపమునందు ప్రళయాగ్నితో సమానుడు. సత్య పరాక్రమ సంపన్నుడు. ఏకపత్నీవ్రతుడు. పితృవాక్య పరిపాలకుడు.

శ్రీరామచంద్రుడు ప్రజాభిప్రాయానికి మిక్కిలి ప్రాముఖ్యము నిచ్చేవాడు. సామాన్య ప్రజల మనోభిప్రాయాలను ఎప్పటి కప్పుడు తన గూఢచారి విభాగం ద్వారా తెలుసుకుంటూ, తదను గుణంగా ఆదర్శవంతమైన ధర్మపరిపాలన కొనసాగించి ప్రజల మన్ననలను చూరగొనిన విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది. తన జీవిత సమరంలో అనేక యిక్కట్లను ఎదుర్కొనడానికి కూడ ఏమాత్రం వెరువని, చలింపని దృఢ సంకల్పుడు. ఆదర్శాలకు అంకితమై చక్కటి ఆదర్శవంతమైన పరిపాలన చేసి, ప్రజల మెప్పును పొంది భావి తరాలవారికి ఆదర్శప్రాయుడైనాడు. మామూల గ్రామంలోని పూరిగుడిసె నుండి వినపడిన మాటలను వేగులవారి ద్వారా విని, నిండు చూలాలు అయిన తన సహధర్మచారిణి సీతాదేవిని నిర్దాక్షిణ్యంగా, ఎట్టి సంకోచం లేకుండా అరణ్యాలకు పంపిన ఆదర్శ చారిత్ర సంపన్నుడు. ప్రజాభిప్రాయానికి శ్రీరామ చంద్రుడు ఎంతటి విలువ నిచ్చేవాడో ఈ ఒక్క ఉదంతంవల్ల మనం బాగా అర్థం చేసుకోవచ్చును. కొడుకులు–కోడళ్లు; కుమార్తెలు–అల్లుళ్ళు మరియు భార్యలవల్ల నేటి పరిపాలకులు, రాజకీయ నాయకులు అప్రతిష్ఠపాలవుతున్నప్పటికి వారిమీద చర్యలను గైకొనడానికి ముందుకు రాకపోగా పైపెచ్చు వారి దుశ్చర్యలకు మద్దతు నిస్తున్న నేటి సమాజానికి శ్రీరామచంద్రుని ఆదర్శం కనువిప్పు కాగలదనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ఈనాటి స్వార్థపూరిత వాతావరణముతో పోల్చుకుంటే రామరాజ్య వైశిష్ట్యం, శ్రీరాముని ఆదర్శం ఎంత ఉన్నతమైనవో మనకు బాగా బోధపడుతుంది.

"లోకారాధన కోసం స్వజనులపట్ల స్నేహాన్ని మానుకో వలసి వచ్చినా, దయను, మమకారాన్ని విడచి నిష్ఠూరంగా వ్యవహరించవలసి వచ్చినా, సుఖ రాజభోగాలను త్యజించవలసి

2)

వచ్చినా, అన్నిటికీ మించి సీతను పరిత్యజించవలసి వచ్చినా నేను ఏమాత్రం బాధ పడను" అని పలికిన శ్రీరామచంద్రుని మాటలలోని అంతరార్థాన్ని అర్థం చేసుకుంటే శ్రీరామచంద్రుని గొప్పతనం, కర్తవ్యపాలనలో అతని దృఢవైఖరి మనకు అవగత మవుతుంది. ధర్మాన్ని తూ. చ. తప్పకుండా పాలించడానికి ఎటువంటి కఠోరమైన నిర్ణయాలనైనా గైకొనడానికి శ్రీరాముడు ఏమాత్రం వెనుదీసేవాడు కాదు. ప్రజాసేవే జీవితపరమావధిగా భావించి, లోకకళ్యాణార్థం అవసరమైతే తన స్వజనులను, చివరికి తన అర్థాంగిని సహితం నవ్వుతూ. నవ్వుతూ త్యజించడానికి కూడా ఏమాత్రం సంకోచించ నటువంటి దృఢసంకల్పుడు. స్వార్థమే పరమావధిగా భావిస్తూ, సంకుచితత్వమే జీవితాశయంగా పెట్టుకుంటూ, బంధుపక్షపాతంతో, భార్యా పిల్లల మమకార బంధనాలలో చిక్కుకొని, సమాజ శ్రేయస్సును విస్మరించి, స్వసుఖాలకోసం ఎంతటి నీచానికైనా వెరువనటువంటి స్వార్థపూరితమైన ప్రస్తుత సమాజానికి శ్రీరామచంద్రుని ఆదర్శం ఒక్కటే శ్రీరామరక్ష కాగలదు.

తండ్రి యాజ్ఞానుసారం పదునాలుగు వత్సరాలు అరణ్యవాసం చేసిన పితృభక్తి పరాయణుడు. ధర్మాచరణ అతని ప్రాణం. అరణ్యానికి బయలుదేరేటప్పుడు పుత్రవాత్సల్యాన్ని వదలుకోలేక తల్లి కౌసల్య విలపిస్తుంది. శ్రీరామునితో పాటు అరణ్యానికి వస్తానని పట్టుపడుతుంది. చివరికి చచ్చిపోతానని బెదిరిస్తుంది. అయినప్పటికి శ్రీరామచంద్రుడు ఏమాత్రం చలించడు. తన కఠోర నిర్ణయాన్ని మార్చుకోవడానికి అంగీకరించడు. తల్లిని ఓదార్చడానికి ప్రయత్నిస్తాడు. "తండ్రి వాగ్దానాన్ని నిలబెట్టడం పుత్రుని కర్తవ్యం. కనుక తండ్రి ఆదేశం ప్రకారం నేను అడవులకు వెళ్ళుతున్నాను. పతివ్రతయగు స్త్రీకి భర్త సేవ చేయడంకంటే వేరొక ధర్మంలేదు. కనుక అయోధ్యలో నుండి

నా తండ్రి దశరథుని సేవించడం సరిగా నీ ధర్మం" అని శ్రీరామచంద్రుడు ఎంతో లౌకికంగా ధర్మాన్ని గురించి తల్లికి వివరిస్తాడు. కర్తవ్యాన్ని ప్రబోధిస్తాడు. ధర్మాన్ని గురించి సునిశితంగా, నిష్కర్షగా చెప్పగల సమర్థుడు శ్రీరామచంద్రుడు.

శ్రీరామచంద్రుడు నారబట్టలను ధరించి లక్ష్మణ సమేతుడై సెలవు తీసుకోనడానికై తల్లులను కలుస్తూ కైకేయి వద్దకు వస్తాడు. కైకేయి నిర్లక్ష్యంగా అతనిని చూస్తూ "పితృవాక్యం పరిపాలించడంలో యింకా ఆలస్యం ఎందులకు?" అని రాముణ్ణి తొందర పెడుతుంది. అప్పుడు శ్రీరాముడు ఎంతో సౌమ్యతతో, సహనంతో "అమ్మా! తండ్రి మాటను నెరవేర్చడంకన్న నాకు గొప్ప సుఖం మరొకటిలేదు. ఈ సంపదకు ఆశపడుతానని భావించవద్దు. భరతుడికి రాజ్యాధికారాన్ని సంతోషంగా యిస్తాను. అతను రాజ్యభారం వహించి ముసలి తండ్రిని చక్కగా చూస్తూ వుంటే అదే నాకు పరమానందం. ఈరోజే ఏ విచారము లేకుండా అడవికి వెళ్ళుతున్నాను. వెంటనే దూతలను పంపి భరతుణ్ణి రప్పించే ఏర్పాట్లు చేయండి. ఆలస్యం చేయకండి" అని ప్రత్యుత్తర మిస్తాడు. కైకేయికి సాదరపూర్వకంగా పాదాభి వందనం చేస్తాడు.

ఇదంతా వింటున్న దశరథుడు 'హా' అని కేకలు వేస్తూ వల వల ఏడుస్తాడు. శోకావేశపరుడై మూర్ఛిల్లుతాడు. రామ లక్ష్మణులు కొంతసేపు సపర్యలు జరుపగా తెలివి వస్తుంది. అడవులకు వెళ్ళవద్దని రామ లక్ష్మణులను బ్రతిమాలుతాడు. పట్టాభిషిక్తుడవై రాజ్యాన్ని వైభవోపేతంగా పాలించమని శ్రీరాముని కోరుతాడు. కాని సత్యసంధుడైన శ్రీరాముడు ససేమిరా అంగీకరించడు. ధర్మసూత్రాన్ని చెబుతాడు. "నాన్నగారూ! తమ అనుజ్ఞకోసం వచ్చాం. నాతో లక్ష్మణుడు, సీత కూడా అడవికి వస్తున్నారు. తమరు అనుమతి యిచ్చి దీవించి

పంపండి. నాకు రాజ్యముపైన గాని, రాజ్య సుఖములపైన గాని యెట్టి వ్యామోహంలేదు. మీ వాగ్దానము నిలబెట్టుటే మా పరమావధి. నేను కోరుకునేది ఒకటే. తమరు సత్యమును పాలించాలి. వాగ్దాన భంగం చేయరాదు. నాన్నగారూ! భరతుడికి వర్తమానం పంపండి. మీరు నా పినతల్లికి యిచ్చిన వరాన్ని పూర్తి చేయండి. రాజ్యాన్ని నేను మనస్ఫూర్తిగా విడిచిపెడుతున్నాను. నా మనస్సంతా ఇప్పుడు అడవిపైనే వున్నది. మీరు మనస్సులో సంకోచం పెట్టుకోక భరతుడికి పట్టం కట్టి దీవించండి. మీరు మనస్సును శాంతపరచుకోండి. దుఃఖించకండి. కంట తడి పెట్టకండి" అని శ్రీరామచంద్రుడు ఎంతో గాంభీర్యంగా, వినయపూర్వకంగా తండ్రి దశరథునికి విన్నవించుకుంటాడు.

తనను అరణ్యానికి పంపడానికి కారణభూతురాలైన పినతల్లి కైకేయి వైపుకు చూచి "అమ్మా! అడవిలో వుండి శరీరపోషణ చేసుకొనే భారం మాత్రం నామీద పెట్టావు. పాపం! కుర్రవాడు భరతునిమీద మాత్రం సమస్త భువన పోషణ భారమూ మోపావు. మా ఇద్దరిలో ఎవరికి, ఎక్కువ సౌకర్యము కలుగజేసావని విచారిస్తే, నీకు నా యెడలనే పక్షపాతం వున్నట్లు గోచరిస్తున్నది. తమ్ముడి మీద ఎక్కువ భారాన్ని మోపావు. నామీద నున్న బరువును తగ్గించావు" అని శ్రీరాముడు చిరునవ్వుతో అంటాడు. నవ్వుతూ, నవ్వుతూ మృదుమధురమైన మాటలు చెబుతూ విషాన్ని సహితం సునాయాసంగా స్వీకరించగల ఓర్పు, ఓర్మి గల ఉదార చారిత్ర సంపన్నుడు శ్రీరామచంద్రుడు. తనను ద్వేషించే వారిని సహితం ఆప్యాయతతో మృదుమధురంగా పలుకరించగల విశాల స్వరూపుడు. తనకు సంక్రమించవలసిన రాజ్యాధికారాన్ని రాకుండా అడ్డం పడిన కైకేయిని సహితం ఆప్యాయతతో పలుకరించి, తన శ్రేయోభిలాషిగా భావించడం ఒక్క శ్రీరామునికే

చేతనయినదిగాని మరెవ్వరికీ సాధ్య పడదు. శ్రీరాముడు ఆతి సహజ, సహస స్వభావ శక్తియుక్తులు గలవాడు. శత్రువులను సహితం మిత్రులవలె ప్రేమించగల సహజగుణ సంపన్నుడు.

తదుపరి తండ్రి వాగ్దానాన్ని నిలబెట్టుటకై సీతా లక్ష్మణులతో సహా అడవులకు పయనమై పోతాడు. శోకిస్తూ, పుత్రుని కోసం పరితపిస్తూ దశరథుడు మరణిస్తాడు. ప్రపంచ చరిత్ర పరికిస్తే శ్రీరామచంద్రుడిలాంటి పాత్ర మరెక్కడా కనిపించదేమో! రాజ్యాన్ని చేబట్టడంకోసం జన్మనిచ్చిన తల్లిదండ్రులను సహితం నిర్దాక్షిణ్యంగా సంహరించిన ఉదంతాలు ఏన్నో కనుపిస్తాయి. రాజ్యాధికారాన్ని సంక్రమింపజేసుకోవడానికి అనేక మారణ హోమాలను సృష్టించిన సంఘటనలు చరిత్ర పుటలను త్రిప్పుతూ పోతే అనేకం చూడగలుగుతాం. శ్రీరాముని లాంటి వ్యక్తిత్వం మాత్రం మరెక్కడా కనుపించదు. ఈ ఘట్టం ఎంతటి మూఢుల హృదయాలనైనా, రాతిగుండెలనైనా కరిగించి వేస్తుం దనడంలో ఏమాత్రం సందేహం లేదు. అందుకే రోజులు గడుస్తున్నా, సంవత్సరాలు దొర్లిపోతున్నా, తరాలు మారి పోతున్నా, యుగాలు మార్పు చెందుతున్నా శ్రీరాముని చరిత్రను మాత్రం మానవాళి మరచిపోలేకుండా మననం చేసుకుంటూనే వున్నది.

దశరథుని మరణానంతరం భరతుడు శ్రీరాముని కలవడానికి దండకారణ్యానికి వెళ్ళుతాడు. అయోధ్యకు వచ్చి రాజ్యభారాన్ని వహించమని ప్రార్థిస్తాడు. తండ్రి మరణవార్తను వినిపిస్తాడు. పిడుగులాంటి యీ వార్తను విని సీతా రామ లక్ష్మణులు విలపిస్తారు. గంగకు పోయి జలతర్పణాదులు గావించి, ఆశ్రమమునకు తిరిగి వచ్చి నలుగురు సోదరులు ఒకరినొకరు కౌగిలించుకొని బావురుమని ఏడుస్తారు. వారిని చూచి అయోధ్య నుంచి వచ్చిన జనం సహితం కళ్ళనీళ్ళు పెట్టుకుంటారు అయోధ్యకు తిరిగి రమ్మనమని భరతుడు

వేడుకుంటాడు. కౌసల్య, సుమిత్ర, కైకేయిలు కూడా ముక్త కంఠంతో రాజ్యాన్ని స్వీకరించమని శ్రీరాముని కోరుకుంటారు. గురువులగు జాబాలి, వశిష్ఠులు సహితం నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తారు. కాని శ్రీరామచంద్రుడు అంగీకరించడు. చేసేది ఏమీ లేక, ఏమి చేయాలో తోచక భరతుడు ప్రాయోపవేశానికి పూనుకుంటాడు. అప్పుడు శ్రీరాముడు "నాయనా! ప్రాయోపవేశము బ్రాహ్మణుల ధర్మము. రాజులకు అది నిషిద్ధం. కనుక ప్రాయోపవేశమును విరమించి, అయోధ్యకు పోయి, తండ్రి యాజ్ఞానుసారము రాజ్యమును పాలింపుము" అని భరతునికి హితవు చెబుతాడు. మరియు "నేను తండ్రి ఆజ్ఞను శిరసావహించి యిక్కడికి (అడవులకు) వచ్చాను. ఇది నా ధర్మం. నీవు కూడా తండ్రిగారి కోరికను, ఆజ్ఞను మన్నించి రాజ్యపాలన చేయడం నీ ధర్మం" అని నచ్చజెప్పి భరతుని పంపించివేస్తాడు. శ్రీరాముని ఉదారత, ధర్మనిష్ఠ, కర్తవ్యపరాయణత్వం, నిస్వార్థబుద్ధి ఎంతటిదో ఈ సంఘటనను బట్టి మనకు అవగత మవుతున్నది. ఏదో విధంగా అధికారాన్ని పొందాలనే తాపత్రయం ఆయనలో అణుమాత్రం కూడా వున్నట్లు గోచరించదు. రాజ్యాధికారాల కన్నా, రాజ్యసుఖాల కన్నా ధర్మమే మిన్నయని ఆచరించి ప్రపంచానికి చూపించిన ఆదర్శప్రాయుడు శ్రీరామచంద్రుడు. ధర్మాన్ని నిలబెట్టడానికోసం స్వసుఖాలను సహితం త్యజించిన త్యాగశీలి, మహామనీషి శ్రీరామచంద్రుడు.

శ్రీరామచంద్రుడు అనుశాసనమును (Discipline) పాటించడంలో అతనికి అతనే సాటి. అతను ఒకమాట అనినచో, ఒక ప్రతిజ్ఞ చేసినచో ఇక దానికి తిరుగులేదు. ప్రాపంచిక సంబంధమైన ఎన్ని విషయాలు అడ్డు వచ్చినా లెక్కచేయడు. పితౄజ్ఞ పాలనమునకై కానల కేగిన అతనిని తిరిగి అయోధ్యకు తీసుకొని రావడానికి ఎవరు ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకుండా

పోయింది. చివరికి ఆజ్ఞ యిచ్చిన తండ్రి బ్రతిమాలినప్పటికి, చివరికి మూర్ఛిల్లినప్పటికి తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. ఆత్మీయులు వద్దని ప్రాధేయపడుతున్నప్పటికి మమకార బంధనాలను పటాపంచలు చేసుకొని కానల కేగిన వజ్రసంకల్పుడు శ్రీరాముడు. అతను అనుశాసనము విషయమున పరమకఠోరుడు. ఒక పర్యాయం తన సత్యానిష్ఠను గురించి అర్ధాంగి అయిన సీతతో "నేను నా ప్రాణముల నైనను త్యజించుదును. అగ్నిసాక్షిగా వివాహమాడిన నిన్ను (సీతను) సైతము విడచుటకు ఏమాత్రం వెనుకాడను. నన్ను దైవముగా భావించి పూజించుచున్న నా అనుంగు సోదరుడు లక్ష్మణుని నైనా త్యజించడానికి ఏమాత్రం వెనుకాడను. కాని వాగ్దానం చేసిన ప్రతిజ్ఞను మాత్రం నెరవేర్చకుండా వుండజాలను" అని శ్రీరామచంద్రుడు తన కఠోర నిర్ణయాన్ని నిస్సంకోచంగా, నిష్కర్షగా ప్రకటిస్తాడు. శ్రీరాముడు ఎన్ని ఆపదలు వచ్చినా, అడ్డంకులు ఏర్పడినా, అవాంతరాలు వచ్చి పడినా తొణకక, బెణకక, ధర్మము తప్పక సంచరించేవాడు.

"ధర్మో రక్షతి రక్షితః. ధర్మమును నిష్ఠతో పాలించిన యెడల ఆ ధర్మమే మనలను కాపాడుతుంది" అని ఏనాడో మన పూర్వీకులు చెప్పారు. ధర్మాచరణమే మనుజుని రక్షించగలదు. ధర్మము చాలా సూక్ష్మమైనది. ఎంతో గాఢంగా యోచన చేస్తే గాని అది మనకు బోధ పడదు. "ధర్మస్య గహనా గతిః" అనే ఆర్యవచనమును శ్రీరాముడు ఆదర్శంగా గైకొనినాడు. అధర్మ వర్తనులు, దుష్టులు పెట్టు హింసల నుండి ధర్మవర్తనులను, శిష్టులను రక్షించడమే జీవితలక్ష్యంగా స్వీకరించాడు శ్రీరామచంద్రుడు. ధర్మ పరిరక్షణకు అవసరమైతే హింసా మార్గమును చేబట్టడం అధర్మం కాదని చాటాడు. "స్త్రీలను చంపరాదు" అనేది సాధారణ ధర్మం. అయినప్పటికి శ్రీరాముడు తాటకిని నిర్దాక్షిణ్యంగా సంహరించాడు. శూర్పణఖ చెవులు, ముక్కులు

కోశాడు లక్ష్మణుడు. లోకకంటకులైనప్పుడు వారు స్త్రీలే అయినప్పటికి అట్టివారిని హింసించడం అధర్మం కాదని, ధర్మమే యని లోకానికి చాటాడు. మారణహోమాలను సృష్టించే దుర్మార్గులను హతమార్చడం ధర్మమే యని భావించి రాక్షస మూకలను సంహరించి దండకారణ్యములో శాంతిని నెలకొలిపాడు శ్రీరాముడు.

శ్రీరాముని హృదయము ఎంత కుసుమ కోమలమో, అంత వజ్ర కఠోరము కూడాను. శ్రీరామచంద్రుని చరిత్రను పరిశీలిస్తే యీ విషయం స్పష్టమవుతుంది. అతనిని శత్రువులు తృణీకరించి నపుడు -పూజ్యులైనను, ఇష్టులైనను, ఆత్మీయులైనను అధర్మ ముగా నడిచినప్పుడు శ్రీరాముని యందు కాఠిన్యము ప్రస్ఫుట మయ్యేది. దయ, కరుణ, ప్రేమ మొదలగు కోమల భావము లన్నియు ప్రాణములు గుప్పెట పెట్టుకొని పారిపోయేవి. అప్పుడు సకల జగత్తు కంపించి పోయేది. బడబాగ్ని బ్రద్దలయిందేమో ననిపించేది. ఉగ్రరూపుడై విలయతాండవం చేసేవాడు. పరశు రాముడు అవహేళన చేసినప్పుడు శ్రీరాముడు ఉగ్రరూపం దాలుస్తాడు. జాబాలి మహర్షి సనాతన మతధర్మాలను కించ పరచ ప్రయత్నించినపుడు శ్రీరాముడు కోపంతో ప్రళయాగ్ని వలె ప్రజ్వరిల్లుతాడు. జనస్థానంలో ఖర దూషణాది పదునాలుగు వేల రాక్షసులను ఒక్క ముహూర్త కాలంలో తుదముట్టించి నప్పుడు అతడు ప్రకటించిన క్షాత్ర తేజము, బలపరాక్రమాదులు అద్వితీయములు.

మైత్రికి నిజమైన పరీక్షా స్థానం కష్టకాలం. అభివృద్ధిలో నున్నపుడు, సకలసంపదలలో విలసిల్లుతున్నప్పుడు స్నేహితుల రూపంలో చాలామంది ప్రక్కన చేరుతారు. చక్కగా అనుభ విస్తారు. కష్టకాలం వచ్చినప్పుడు మాత్రం నిజమైన మిత్రులు తప్ప మిగతావా రందరూ దూరమవుతారు. మటుమాయ

మనుతారు. అటువంటి కష్టకాలంలో కూడ ఛాయ వలె ఎవరు విడవకుండా వుంటారో వారే నిజమైన మిత్రులు. ఇతరుల కష్ట సుఖములలో తన కష్టసుఖములను చూడగలిగినవాడే నిజమైన మిత్రుడు. ఇతరులకు కలిగిన కష్టములను చూచి శ్రీరాముడు తనకు వచ్చినట్లుగనే భావించి దుఃఖించేవాడు. ఇతరులకు శుభములు కలిగినపుడు వారి యభివృద్ధిని జూచి సంతోషించేవాడు. భారత దేశంలో మైత్రికి అత్యున్నతమైన స్థానం వున్నది. శ్రీకృష్ణ కుచేలుల మైత్రి ఉత్తమ మైత్రికి నిదర్శనం. పరస్పర ప్రయోజనమును పురస్కరించుకొని రామ, సుగ్రీవులకు మైత్రి ఏర్పడింది. అయినప్పటికి ఉదార స్వభావులు, కృతజ్ఞులు కావడంవల్ల వారి మైత్రి ప్రయోజన సిద్ధితో పరిసమాప్తం కాలేదు. వాలి వధతో సుగ్రీవుడు ఆశించిన పని పూర్తి అయినప్పటికి, కృతఘ్నుడై శ్రీరాముని మేలును మరవలేదు. సీతను వెతకడానికి తన వానరబలాన్ని నలుదిక్కులా పంపించాడు. లంకాపురిని జయించడానికి తన సర్వశక్తిని ధారపోశాడు. సీతాదేవిని శ్రీరామునికి అప్పగించాడు. శ్రీరాముడు కూడా తన పని పూర్తి అయింది గదా యని భావించి, స్వార్థంతో సుగ్రీవ బృందమును వదలివేయలేదు. సీతతోపాటు వానరబలాన్ని కూడ అయోధ్యకు తీసుకొని వెళ్ళి ఉచితరీతిని గౌరవించి, సన్మానించి, కానుకలు సమర్పించి ఆదర్శ స్నేహ శీలమును ప్రదర్శించుతాడు శ్రీరామచంద్రుడు. సహజంగా ప్రస్తుత ప్రపంచంలో తమ పని పూర్తి చేసుకొనేంత వరకు వెంటబడి తిరుగుతుంటారు. ఇంద్రుడు, చంద్రుడు యని పొగడుతుంటారు. పని పూర్తి కావడంతోనే చెప్పకుండానే పోతారు. కంటికి కూడా కనుపడరు. శ్రీరామ, సుగ్రీవుల మైత్రి అటువంటిది మాత్రం కాదు. భావితరాలకు ఆదర్శప్రాయమైనది. నేటి సమాజం కృష్ణ-కుచేలులను; రామ-సుగ్రీవులను ఆదర్శముగా

గైకొంటే కలతలకు, కల్లోలాలకు, వైషమ్యాలకు, ద్వేషాలకు ఆస్కారమే వుండదు.

శ్రీరామచంద్రుడు శరణాగత పరాయణుడు. తన వద్దకు వచ్చి శరణు జొచ్చిన ప్రతిజీవికి అభయ మివ్వడం అతని వ్రతం. శరణాగత రక్షకుడే కాదు. గొప్ప రాజనీతికోవిదుడు. మహాబల పరాక్రమ సంపన్నుడు. ఏదైనా క్లిష్టసమస్య ఎదురైనపుడు నిరుత్సాహ పడక ప్రసన్నచిత్తంతో, వివేకంతో ఆలోచించి, సమయస్ఫూర్తితో, సముచితమైన నిర్ణయాలను గైకొనగల సమర్థుడు శ్రీరామచంద్రుడు. ధర్మమును పాటించవలసి వచ్చినపుడు సంకోచించడంగాని, వెనుక ముందు లాడడంగాని వుండేది కాదు. దృఢవైఖరిని అవలంబించేవాడు. విభీషణుని ఆహ్వానించడంలో సుగ్రీవుడు మొదలగు వానరశ్రేష్ఠు లందరు భిన్నాభిప్రాయాలను వెలిబుచ్చినప్పటికి శ్రీరాముడు తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. విభీషణునికి అభయ మివ్వడమే కాదు, సపుత్ర జన బాంధవముగ రావణుని యుద్ధభూమిలో చంపకుండగ అయోధ్యలో అడుగుపెట్టేది లేదని శ్రీరాముడు శపథం చేస్తాడు. వెంటనే సముద్రజలాలను తెప్పించి విభీషణునికి లంకారాజ్యాభిషేకం గావిస్తాడు. విభీషణుడు ఆనందపరవశుడై, సంతోషంతో శ్రీరామునికి అండగా నిలచి, లంకాపురిని జయించడంలో తన సర్వశక్తిని వినియోగిస్తాడు. ఇచట శ్రీరాముడు శరణాగత రక్షకుడుగానే గాక. సుప్రసిద్ధుడైన అనుభవంగల రాజనీతిజ్ఞు డుగా పేరు ప్రఖ్యాత లందుకున్నాడు. శత్రుపక్షమునకు చెందిన ఒక ప్రముఖుని, అందులో రావణుని స్వంత తమ్మునికి అభయ ప్రదానం చేయడం, భవిష్యత్తులో ఆక్రమించబోవు లంకాపురిని ముందుగానే విభీషణునికి రాజ్యాభిషేకం చేయడం శ్రీరాముని దూరదృష్టికి, రాజనీతికి ప్రబల నిదర్శనం.

నేటి పాలకులు శ్రీరాముని పరిపాలనాదక్షతను, ఆయన ప్రదర్శించిన రాజనీతిజ్ఞతను అనుసరించితే చక్కటి పరిపాలకులుగా

చలామణి కాగలరు. శరణాగతరక్షణ శ్రీరామచంద్రుని అనాది సంకల్పసిద్ధమగు సహజ వ్రతము.

మారీచుడు శ్రీరామునికి బద్ధశత్రువే అయినప్పటికీ, శ్రీరామునిలోని ఉత్తమగుణాలను రావణునికి ప్రశంసిస్తూ చెబుతాడు. ఎవని యొక్క పరాక్రమమునకు వేలాదిమంది రాక్షసులు ప్రాణాలను కోల్పోతారో, అట్టి శత్రువగు శ్రీరామ చంద్రుని గురించి నీచంగా చెప్పక అత్యున్నతంగా పొగడుతూ మారీచుడు "శ్రీరామచంద్రుడు నీవు భావించినట్లుగా కర్కశుడు కాదు. అజ్ఞాని అంతకన్నా కాదు. అబద్ధమాడడు. ధర్మమూర్తి, సాధువు, సత్యపరాక్రముడు" అని ఎంతగానో శ్రీరాముని గురించి చెబుతాడు. శ్రీరామచంద్రుని యొక్క నడత, అత డనుసరించిన విధానం, అతడు చేబట్టిన పంథా, అతడు పాలించిన ధర్మం శత్రువు లను సహితం మంత్రముగ్ధులను గావించింది. శత్రువులు సహితం అతనిలో ఏ తప్పు పట్టలేక పోయేవారు. సరియైన వీరుని లక్షణం అదే. స్వపక్షీయుల మెప్పును పొందడం సహజం. ప్రతిపక్షీ యుల అభిమానాన్ని పొందడం మాత్రం చాలకష్టం. సామాన్యు లకు అది అసంభవం. మహనీయులకు మాత్రమే అది సాధ్య మవుతుంది. శ్రీరాముడు ఆ ఉత్తమకోవకు చెందినవాడే ననడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

శ్రీరాముని భ్రాతృప్రేమ వర్ణనాతీతము. సోదరులంటే అతనికి అత్యంత మమకారం, మక్కువ. లక్ష్మణుడు లేకుండగ నిద్రించేవాడు కాదు. తన కొరకు మృష్టాన్నం తెచ్చి యిచ్చి నప్పటికి లక్ష్మణుడు లేకుండుగ భుజించేవాడు కూడా కాదు. ఒక మారు లక్ష్మణునితో "భరతుడు గాని, శత్రుఘ్నుడు గాని, నీవు గాని లేకుండగ ఎట్టి అల్పమగు సుఖములను కోరను. ఒకవేళ అటువంటి కోరిక నా మదిలో ఉదయిస్తే దానిని అగ్నిహోత్రుడు భస్మము చేయుగాక! ఈ భూమి నా కొఱకు గాక మీ కొఱకు

(సోదరులు) కావలెనని కోరుచున్నాను. మిమ్ము సంతోష పెట్టుటకును, సుఖములను కలుగజేయుటకును నాకు రాజ్య మపేక్షితము" అని శ్రీరామచంద్రుడు ఎంతో ప్రేమతో అంటాడు. ఈ ప్రేమవాక్యాల వెనుక శ్రీరాముని ఆదర్శాలు ప్రస్ఫుటంగా కనుపిస్తవి. శ్రీరాముని సోదరప్రేమను ప్రతి కుటుంబం ఆదర్శంగా గైకొంటే కుటుంబాలలో కలతలు మటుమాయ మవుతాయి. ద్వేషాలకు, వైషమ్యాలకు ఆస్కారమే వుండదు. సుఖసంతోషాలతో, ఆనందోల్లాసాలతో జీవితాలను నడుప గలుగుతారు.

శ్రీరాముడు సత్యపరాక్రముడు. సత్యనిష్ఠగల మహాను భావుడు. సత్యమే సకలజగత్తుకు ఆధారమని ఎలుగెత్తి చాటిన సత్యవ్రతి. అతని సత్యనిష్ఠను గురించి ప్రశంసిస్తూ సీతాదేవి హనుమంతునితో "శ్రీరాముడు దానము చేయునుగాని, ప్రతి గ్రహ మెఱుగడు. అతడు తన ప్రాణములను కాపాడుకొనుట కైనను అబద్ధ మాడడు. కావుననే అతడు సత్యపరాక్రముడు" అని చెబుతుంది. శ్రీరామచంద్రునిలోగల ధర్మనిష్ఠ, సత్యనిష్ఠ కర్తవ్యనిష్ఠ మరెవరిలోను కనుపించదు.

యుద్ధభూమిలో రావణుడు అతి శక్తివంతమైన 'శక్తి' అనే అస్త్రమును లక్ష్మణుని మీదకు వదులుతాడు. ఆ దెబ్బకు లక్ష్మణుడు మూర్ఛిల్లుతాడు. శ్రీరాముని హృదయం పరితపిస్తుంది. ఎంతిగానో విలపిస్తాడు. లక్ష్మణుడు గతించిన తరువాత రావణునితో యుద్ధం చేయడం వ్యర్థమని భావిస్తాడు. వనవాసానికి బయలుదేరే టప్పుడు తల్లి సుమిత్రను, ప్రియురాలు ఊర్మిళను సహితం వదలి, తనతోపాటు ఏ విధముగా బయలుదేరి కానలకొచ్చాడో, అదే విధముగా యిప్పుడు యమసదనమున కరుగు లక్ష్మణునితో కలసి తాను కూడా యమలోకానికి పోతానని విలపిస్తాడు. లక్ష్మణుడు లేని రాజ్యం శ్మశానంతో సమానమని భావిస్తాడు.

మరొక పర్యాయం యుద్ధభూమిలో రామ లక్ష్మణు లిద్దరూ ఒకే పర్యాయం నాగపాశ బద్ధులై పడిపోతారు. వారిద్దరిలో శ్రీరామునికి ముందుగ తెలివి వస్తుంది. లక్ష్మణుని చూచి కన్నీరు కారుస్తూ "సీతవంటి భార్య భూలోకమున ఎచటనైనను వెదికిన లభించవచ్చును. కాని లక్ష్మణునితో సమానమగు సోదరుడు మాత్రం లభించుట దుర్లభం" అని శ్రీరాముడు బావురుమని ఏడుస్తాడు. దీనినిబట్టి శ్రీరామచంద్రునికి తన సోదరుల పట్ల అత్యంత ప్రేమాభిమానాలు వున్నాయనే విషయం స్పష్ట మవుతున్నది. సోదరులపట్ల గల శ్రీరాముని ప్రేమ అతిపవిత్ర మైనది, నిష్కల్మషమైనది, ప్రతిఫలాపేక్షరహితమైనది.

శ్రీరామచంద్రుడు ఆదర్శవీరుడు. ఒకసారి యుద్ధభూమిలో రావణునితో ఎదురుపడి యుద్ధం చేయవలసి వస్తుంది. రామబాణం ధాటికి తట్టుకోలేక, రావణుడు తన ఆయుధాల నన్నింటిని కోల్పోయి యుద్ధభూమిలో నిరాయుధుడై, నిస్సహాయ స్థితిలో నిలబడి వుంటాడు. అటువంటి నిస్సహాయ స్థితిలో నున్న రావణుని చంపడం ధర్మం కాదని శ్రీరాముడు భావిస్తాడు. రామసేనలోని పెక్కు వీరులను హతమార్చిన పరమశత్రువు రావణుడే చేతికి చిక్కినప్పటికీ, అన్యాయంగా అతనిని లంకాపురి నుంచి యమపురికి పంపడానికి శ్రీరాముడు యిష్టపడలేదు. నిస్సహాయుడై యుద్ధభూమిలో నిలబడి వున్న రావణునితో "ఓ రాక్షసరాజా! లంకా పట్టణం లోనికి వెళ్ళి కొంచెం విశ్రాంతి తీసుకో, పాపం! అలసిపోయినావు. కొంతసేపు విశ్రాంతి తీసికొని, తిరిగి రథారూఢుడవై, ధనుస్సును ధరించి తిరిగి మళ్ళీ యుద్ధభూమికి రా. అప్పుడు నా పరాక్రమమును చూచెదవుగాక!" అని శ్రీరాముడు ఎంతో హుందాతనంగా, ఔదార్యంతో ప్రవర్తిస్తాడు. ప్రియాతిప్రియమైన తన అర్ధాంగి సీతను అపహరించిన పరమకిరాతకుడు తన చేజిక్కినప్పటికీ, అవకాశం దొరికిందికదా యని కక్షతో అధర్మంగా రావణుని

చంపదలచలేదు. యుద్ధనీతిని, మర్యాదను తూ చ తప్పకుండా అనుసరించిన ధర్మశ్రేష్ఠుడు, సత్యసంధుడు, యుద్ధనీతికోవిదుడు శ్రీరామచంద్రుడు.

శత్రువులకు కూడా శ్రీరాముని సచ్ఛీలము యెడల అత్యున్నతమైన విశ్వాసం, గౌరవం వుండేది. యుద్ధభూమిలో రావణుని కుమారుడైన మేఘనాథుని లక్ష్మణుడు చంపుతాడు. భార్య సులోచన సహగమనము చేయ సంకల్పించుకుంటుంది. భర్త శవం యుద్ధభూమిలో వుంటుంది గదా! అపుడు రావణుడు తన కోడలిని పిలిచి శ్రీరాముని శిబిరానికి వెళ్ళి అడిగి భర్త శవాన్ని తెచ్చుకోమంటాడు. శత్రు శిబిరానికి వంటరిగా వెళ్ళడానికి సులోచన సంకోచిస్తుంది. సంశయిస్తుంది. అపుడు రావణుడు "బాల బ్రహ్మచారి హనుమంతుడు, జితేంద్రియుడు లక్ష్మణుడు, ఏకపత్నీవ్రతుడు శ్రీరాముడు వున్నచోటుకి నీవు నిర్భయముగా వెళ్ళవచ్చును, అమ్మా!" అని ఎంతో విశ్వాసంతో అంటాడు. అప్పుడు "మీరు రాముని భార్యను తెచ్చారే! అలాంటి రాముని దగ్గరకు మీ కోడలిని పంపడం ఉచితమా?" అని మంత్రులు సందేహాన్ని వెలిబుచ్చుతారు. అప్పుడు రావణుడు "పరస్త్రీని అపహరించడం రావణుని పని; రాముని పనికాదు" అని అంటాడు. శత్రువులకు కూడా శ్రీరాముని యెడల ఎటువంటి సద్భావం వుండేదో, అతని శీలం యెడల ఎంతటి విశ్వాసం వుండేదో ఈ సంఘటనవల్ల మనం బాగా అర్థం చేసుకోవచ్చును. పరస్త్రీలను తన స్వంత సోదరీమణులలా చూచుకొనేటటువంటి శీల సంపత్తిని సంపాదించిన ఉత్తమ పురుషుడు శ్రీరాముడు.

త్రిలోకాధిపతియైన రావణుడు శ్రీరాముని చేతిలో మరణిస్తాడు. యుద్ధం ముగుస్తుంది. లంకాపురి శ్రీరామునికి వశమవుతుంది. సువర్ణమయమయిన లంకాపురిని చూచి లక్ష్మణుడు మోహపడుతాడు. లంకాపురిని వదిలి రావడానికి లక్ష్మణునికి

మనస్కరించక, "అన్నయ్యా! సువర్ణమయమయిన యీ లంకా పురిని వదిలి, నిరుపేదదైన అయోధ్యకు వెళ్ళడం దేనికి? ఇక్కడనే వుండి సకల సంపదలను అనుభవిస్తూ హాయిగా కాలం గడుపుదాం" అని అంటాడు. అప్పుడు ఎంతో బాధతో, కోపంతో శ్రీరాముడు లక్ష్మణునికి ప్రత్యుత్తరం యిస్తాడు.

**" అపి స్వర్ణమయీ లంకా నమే లక్ష్మణ రోచతే**
**జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసీ. "**

"ఓ లక్ష్మణా! లంక బంగారు మయమైనను, నాకు ఇష్ట మగుటలేదు. తల్లియు, జన్మించిన దేశమును స్వర్గము కంటే శ్రేష్ఠమైనవి" అని అంటాడు.

శ్రీరామునికి మాతృ, పితృ భక్తులతోపాటు, మాతృదేశ భక్తి కూడా ఎంత గాఢంగా వుండేదో స్పష్టమాతున్నది. తల్లి కురూపి కావచ్చు. అంగవైకల్యము కలది కావచ్చు. ముసలిది అవవచ్చు. అయినప్పటికి నవమాసాలు మోసి కని పెంచిన తల్లి తల్లే. ఆమె మాతృమూర్తే. అదేవిధముగా జన్మించిన దేశం పేదది కావచ్చు. బీదది అవవచ్చు. అయినప్పటికి జన్మించిన దేశం మీద మమకారాన్ని విడనాడరాదు. తల్లిలాంటిదే జన్మించిన దేశం కూడాను. తన సర్వశక్తిని ధారపోసి, విజ్ఞానాన్ని సముపార్జించి, దేశాభివృద్ధికి తోడ్పడటం నిజమైన పౌరుని లక్షణం, ధర్మం కూడాను. ఈ భావాన్నే శ్రీరామచంద్రుడు ప్రపంచానికి చాటాడు. ఆ మహనీయుని ఉత్తమాదర్శాలను అవలంబించి అనుసరిస్తే దేశం ఇంకా ముందుకు పోతుంది.

సీతాదేవి అడవులలో నున్నపుడు శ్రీరాముడు అశ్వమేథ యాగం చేయ సంకల్పించుకుంటాడు. సతీసమేతుడైనవాడు మాత్రమే ఈ యాగాన్ని చేయడానికి అర్హుడు. అటువంటి అగ్ని పరీక్షా సమయంలో కూడ ద్వితీయ పత్నిని పరిగ్రహించడానికి

శ్రీరాముడు అంగీకరించడు. సువర్ణ సీతామూర్తిని ప్రక్కన పెట్టుకొని యాగం పూర్తిచేస్తాడు. ఆ కాలంలో బహు భార్యాత్వం తప్పుకాదు. శాస్త్ర సమ్మతం కూడాను. తండ్రియైన దశరథునికి 350 మంది భార్యలుండేవారని పురాణాలు చెబుతున్నాయి. పరశురాముడు దండెత్తి వచ్చినపుడల్లా, అతని బారినుండి తప్పించుకోవడానికి దశరథుడు వివాహం చేసుకుంటుండేవాడట. బహు భార్యాత్వాన్ని ప్రోత్సహించిన అటువంటి సమాజ పరిస్థితులలో కూడ శ్రీరామచంద్రుడు 'ఏకపత్నీ వ్రతాన్ని' విడనాడలేదు. ఈ సంఘటన శ్రీరాముని సౌశీల్యాన్ని యినుమడింప చేస్తున్నది. కామాంధకారంతో కన్నూ మిన్నూ కానకుండా కనపడిన స్త్రీని చెరలోపెట్టి అనుభవించ ప్రయత్నిస్తున్న కామాంధులకు శ్రీరాముని సౌశీల్యం కనువిప్పు కాగలిగితే దేశంలో శీలసంపద అభివృద్ధి చెంది సుఖశాంతులతో జీవించగలుగుతారు. ఉత్తమ శీల సంపత్తి గలవాడు కావడం వల్లనే మహాత్మా గాంధీజి శ్రీరాముని ఆదర్శంగా గైకొనినాడు.

శ్రీరామచంద్రుడు ధర్మమూర్తి, ఆదర్శవీరుడు, ఆదర్శ ప్రభువు, ఆదర్శ పతి, ఆదర్శ సోదరుడు, ఆదర్శ మిత్రుడు, దీన జనోద్ధారకుడు. మాతా, పితృ, ఆచార్య భక్తుడు, సకల కళ్యాణ గుణాకరుడు. అందువలననే అతని రాజ్యమున గల సకల జనులు పరస్పరం తగవులాడుకొనక, హింసించుకొనక, కలహించుకొనక సుఖశాంతులతో జీవితములను గడిపిరి.

ఆ మహనీయుని చరిత్రను పఠించినచో మన మనస్సులలో గూడు కట్టుకొని యున్న కుటిలత్వం మటుమాయ మగును. ఈర్ష్యా ద్వేషాలకు తావే వుండదు. స్వార్థం, సంకుచితత్వాలు శాశ్వతంగా సమాధి చేయబడుతాయి. మానవునిలో సహజ సిద్ధంగా నెలకొని వున్న బలహీనతలు వైదొలగి, దైవగుణములు సంప్రాప్త మవుతాయి. అట్టి సద్గుణములను మానవుడు

వికసింప జేసుకొనినచో దివ్యానుభూతిని పొందగలుగుతారు. ముఖ్యముగా నేటి పరిపాలకులు ఆ మహనీయుని అనుసరిస్తే దేశంలో అశాంతి అంతరిస్తుంది. సంక్షోభాలు చెలరేగనే చెలరేగవు.

శ్రీరాముని ఆదర్శవంతమైన పరిపాలనలో ప్రజలు సుఖ శాంతులతో కాలం గడిపారు. అందువలననే వేల సంవత్సరాలై నప్పటికి శ్రీరాముని ప్రజలు మరవలేకుండా వున్నారు. ఒక్క భారత దేశంలోనే గాక, ప్రపంచ మానవ హృదయాలలో కూడ శ్రీరామచంద్రునికి ఎప్పుడూ స్థానం వుంటుంది.

"దూతయైన వాడు ప్రభుకార్యమును నిర్వహించుటపైననే తన దృష్టి నంతను కేంద్రీకరించవలెను. తన స్వసుఖ-సంతోషముల కాశపడి ప్రభు కార్యమును మఱచిపోరాదు. తన మూలమున నెట్టి ఆలస్యము జరుగనీయరాదు. దానివలన పెక్కు అనర్థములు కలుగవచ్చును. సకాలములో నిర్వహించలేక పోయినచో గోళ్ళతో గిల్లిన పోవు పని కొఱకు గొడ్డళ్లను ఉపయోగించవలసి వస్తుంది. రాజకార్య నియుక్తులగు వారు ముఖ్యముగా కర్తవ్య పరాయణులుగను, దూరదృష్టి గలవారై యుండుట చాలా ముఖ్యము."

— డా. మల్లాది గోపాలకృష్ణశర్మగారి రామాయణ వైభవము నుండి

"స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య, ముఞ్చతో నాస్తిమే వ్యథా"

"లోకము యొక్క సేవ కొఱకు స్నేహమును, దయను, సుఖమును ఒకవేళ జానకినైనను కూడా విడచుటకు నాకు బాధలేదు - శ్రీరామచంద్రుడు"

—భవభూతి "ఉత్తర రామచరిత్ర"

3

# సీతాదేవి

"ఏ దేశ వాఙ్మయమునైనను శ్రీరామచంద్రునివంటి పురుషోత్తములు లభించిన లభించవచ్చునేమో గాని, సీతవంటి యాదర్శచరిత్రగల పతివ్రతా తిలకము లభించుట దుర్లభము."

— స్వామి వివేకానంద

శ్రీమద్రామాయణ మహాకావ్యమునందు సీతాదేవికి శ్రీరామచంద్రునితో సమానమగు ప్రాధాన్యము నిచ్చాడు వాల్మీకి మహర్షి. అంతేకాదు. ఈ మహాకావ్యమునకు 'సీతాయాశ్చరితమ్' అని పేరు కూడా పెట్టి యున్నాడు శ్రీరామచంద్రునివలె ఆమె కూడ కారణజన్మురాలని చెప్పబడినది. ఆమె ఒక్క భారత దేశమునకే గాక యావత్ ప్రపంచములోని నారీలోకానికి కూడా ఆదర్శప్రాయురాలు. నిశ్చలమగు పతిభక్తి, పెద్దల యెడల గౌరవము, ధర్మనిష్ఠ, వినయ వివేక సౌశీల్యాదులు కష్టముల యందు అచలత్వము, అసాధారణమగు క్షమ, కరుణ, దయ, నిర్మలమగు ప్రేమ, పవిత్రత మొదలగు ఉత్తమ సద్గుణము లన్నియు ఆమెలో మూర్తీభవించి, నిమిడీకృతమై వున్నాయి. ఆదర్శస్త్రీలో వుండవలసిన సత్ప్రవర్తన, మంచి నడత, సుగుణశీల సంపత్తులు ఏవిధముగా వుండాలో, తన జీవన గమనం ద్వారా నిరూపించి, చూపించి ఆచరించిన పరమ సాధ్వీమణి, సౌశీల్యవతి, పతివ్రతా శిరోమణి సీతాదేవి.

ఆమె పన్నెండు సంవత్సరములు అయోధ్యలో, మఱి పదమూడు సంవత్సరములు అరణ్యము నందు భర్తతో కష్ట

సుఖములను, సుఖదుఃఖములను సమంగా అనుభవించింది. మఱి ఒక సంవత్సరం అశోకవనంలో భర్తకు దూరమై వియోగ జీవితమును ఓర్పుతో, సహనంతో అనుభవించి పాతివ్రత్య మహిమను ప్రపంచానికి చాటింది.

శ్రీరామచంద్రుడు తండ్రి ఆజ్ఞానుసారము అరణ్యావాసానికి పోవునని వార్త విని, తనను కూడ అరణ్యమునకు తీసికొని వెళ్ళమని బ్రతిమాలుకుంటుంది. శ్రీరాముడు మొదట్లో అంగీకరించడు. అయోధ్యలోనే వుండి అత్తమామలకు సేవచేస్తూ వుండమని కోరుతాడు. సీతాదేవికి కోపం వస్తుంది. "భర్త లేని స్వర్గ సుఖముల కంటే, భర్తతో అరణ్యావాస దుఃఖమే మేలు. నీతో కలసి వుండటమే స్వర్గము. అదియే నాకు పరమ సుఖం. నిన్ను విడచి వుండుటయే నాకు నరకం. రాముడు అడవికి వెళ్ళాలన్న ఆజ్ఞ భార్యగా నాకు కూడా వర్తిస్తుంది. ఐశ్వర్యములు గాని, ధనము గాని నన్ను లోభపెట్ట జాలవు. రాజ్యసుఖములను కోరను. నావల్ల మీకు ఎలాంటి యిబ్బందులూ కలుగవు. ఆనందంతో వనవాసాన్ని గడుపుతాను. కాయలు, గడ్డలూ తింటూ మీతోనే వుంటాను. పతిసేవ చేయడం సతి ధర్మం. అడవికి వెళ్ళేటప్పుడు మీ ముందు నడుస్తూ ముళ్ళూ, దర్భలూ పెరికివేస్తూ దారిని శుభ్రం చేస్తుంటాను. మొండిపట్టు పడుతున్నా నని కోప్పడకండి. భర్తను అనుసరించడమే భార్యగా నాధర్మం కదా! నాపై దయ వుంచి నన్ను వెంట తీసికొని వెళ్ళండి" అని ప్రాధేయపడుతుంది. తనను వనవాసమునకు తీసికొని వెళ్ళని యెడల విషము త్రాగియో, నీటిలో పడియో, అగ్నిలో దూకియో మరణిస్తానని బెదరిస్తుంది. శ్రీరామచంద్రునికి తప్పనిసరి అవుతుంది.

సీతను కూడా వనవాసానికి తీసికొని వెళ్ళడానికి అనుమతిస్తాడు. సీత పేద బ్రాహ్మణులను పిలిపించి తన అత్తగారు పెట్టిన

వస్తువులను వాళ్ళకి దానం చేస్తుంది. నారబట్టలను ధరించి, చిరునవ్వుతో సంతోషంగా రథం ఎక్కుతుంది. సుఖంలోనే కాక, దుఃఖములో కూడా పాలు పంచుకోవడం నిజమైన భారత నారీ ధర్మమని నిరూపించింది సీతాదేవి. పత్ర, పుష్ప, ఫల, కందమూలాదులలో ఏది, ఎంత యిచ్చినప్పటికి, దానినే అమృతప్రాయంగా భావించి, స్వీకరించి ఏమాత్రం భారం పెట్టకుండా అనుసరిస్తానని వాగ్దానం చేస్తుంది. ఎట్టి కష్టములను కలుగజేయనని చెబుతుంది. దీనిని బట్టి సీతయొక్క నిర్మలమైన ప్రేమ, పతిభక్తిపరాయణత్వము స్పష్టంగా బోధపడుతున్నది భారతస్త్రీ కోరుకొనేది మేడలు, మిద్దెలు, భవనాలు, భోగాలు, సుఖాలు కావని, భర్తయొక్క ప్రేమానురాగాలు మాత్రమేనని, భర్తయొక్కసాంగత్యమేనని నిరూపించింది. భర్తను సేవించడమంటే భగవంతుని సేవించడమేనని, భర్త సన్నిధిలో జీవితాన్ని గడపడం ఒక్కటే భారతస్త్రీ యొక్క పరమోత్కృష్టమైన ధర్మమని ప్రపంచానికి చాటింది. భారతస్త్రీకి ధర్మం, భర్త- ఈ రెండే శరణ్యమని నిరూపించింది.

సీతాదేవి ఉత్తమ గృహిణి. ఆమె తన అత్తమామలను జననీజనకులుగా నెంచి, భావించి ప్రేమించేది. తన భర్తను అరణ్యవాసమునకు పంపిన దశరథుని గాని, కైకేయిని గాని పల్లెత్తు మాట కూడ అనక భర్తను అనుసరించింది. వారి యెడల ద్వేషమును ప్రకటించలేదు. వారిని గురించి కించపరుస్తూ మాట్లాడనూలేదు. దశరథుని మరణవార్త విన్నప్పుడు భర్త కన్నా యినుమిక్కిలిగా విలపించింది. దశరథునిపట్ల ఆమెకు గల పితృ వాత్సల్యం. అత్తగార్లపట్ల ఆమె ప్రదర్శించిన తీరుతెన్నులు అసమానములు. ఆదర్శగృహిణిగా అతిథులను మర్యాద చేయడంలోగాని, ఉచితరీతిని సత్కరించడంలోగాని ఆమెకు ఆమే సాటి. గృహస్థధర్మమును చక్కగా, ఆదర్శవంతంగా పాటించిన సాటిలేని మేటి ఉత్తమ గృహిణి సీతాదేవి.

సీతాదేవి యెంత పతివ్రతయో అంత త్యాగమూర్తి కూడాను. ఆమె తన పతి కొఱకు తన ప్రాణములనైననూ సంతోషముతో త్యజించగలదు. ఆమె జీవితం త్యాగమయం. 'విరాధుడు' అను రాక్షసుడు రామ లక్ష్మణులను తన భుజస్కంధములపై నిడుకొని పారిపోవుచుండు సన్నివేశమును కళ్ళారా చూచి ఆమె పెద్దగా రోదనం చేస్తూ "మాం హరోత్సృజ కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ. తనను భక్షించి రామ లక్ష్మణులను వదిలి వేయుము" అని విరాధుని ప్రార్థిస్తుంది. తన పతి కొఱకు తన జీవితాన్ని సహితం సంతోషంగా సమర్పించుకోవడానికి కూడ ఏమాత్రం వెనుకంజ వేయలేదనే విషయం ఈ సంఘటన ఋజువు చేస్తున్నది. త్యాగమయమైన సీతాదేవి ఆదర్శ జీవితాన్ని స్త్రీజాతి ఆదర్శముగా గైకొనాలి.

మానవుని యొక్క వ్యక్తిత్వం కష్టముల యందే కనిపిస్తుంది. అప్పుడే వికసిస్తుంది. ప్రచండ దుఃఖంలోనే మానవుడు తన అస్తిత్వాన్ని గుర్తిస్తాడు. సాధారణ వ్యక్తులు, మహాత్ముల మధ్య విస్పష్టంగా ఒక తేడా కనిపిస్తుంది. సాధారణ వ్యక్తులు దైవానుగ్రహం వల్ల పరిస్థితులు అనుకూలిస్తే ఉన్నత స్థితిని పొందగలుగుతారు. కాని విషమ పరిస్థితులలో మాత్రం లక్ష్యభ్రష్టు లగుదురు. మహాత్ములు మాత్రం అటుల గాక విషమ పరిస్థితులు దాపురించినపుడు గూడ భయపడక, కంగారు పడి ఆత్మస్థైర్యమును కోల్పోక ధైర్యంతో పరిస్థితులను ధీమాతో ఎదుర్కొని లక్ష్యమును సాధించగలుగుతారు. ఎన్ని ఇబ్బందు లెదురైనప్పటికి తమ విధ్యుక్త ధర్మమును విడనాడరు. ఆపత్కాలమునందుకూడా మనోధైర్యమును కలిగి వుంటారు. చేబట్టిన కార్యములకు మధ్యలో విఘ్నములు కలిగినప్పటికి పిరికివాళ్ళలా విడిచిపెట్టి పారిపోరు. అవసరమైన యెడల లక్ష్య సాధనలో తమ ప్రాణములను సహితము బలిపెట్టుటకు ఏమాత్రం వెనుకాడరు. లక్ష్యసిద్ధికై నిరంతరం

పోరాడుతునే వుంటారు. సీతారామచంద్రులలో గల గొప్పతనము, విశిష్టత అటువంటిదే.

సీతను రావణుడు బలాత్కారముగా అపహరించి తీసికొని పోతున్నపుడు విలపిస్తూ కూడా సమయస్ఫూర్తితో ప్రవర్తిస్తుంది. సహజంగా కష్టకాలంలో వున్నపుడు బుర్ర పని చేయదు. సమయ స్ఫూర్తితో గూడిన ఆలోచనలు అసలే రావు. ఈర్ష్య, ద్వేషాలు మాత్రం మనస్సును ఆవరిస్తాయి. ఆలోచించే శక్తి నశిస్తుంది. ఏమి చేయాలో తోచక విచారంతో కుమిలి కృశించి పోతుంటారు. పై పెచ్చు కోపం ఎక్కువవుతుంది. విజ్ఞతను కోల్పోయి భగవంతుని కూడ దూషించడం జరుగుతుంది. ఆత్మీయులను అపార్థం చేసు కుంటారు. దానితో బుర్ర వేడెక్కుతుంది. సహనం కోల్పోతారు. ఇష్టం వచ్చినట్లు మాట్లాడటం ప్రారంభిస్తారు. చివరకు పిచ్చి వాళ్ళవుతారు. ఇవి సామాన్యుల లక్షణాలు. సీతాదేవికి మాత్రం ఇవి వర్తించవు. అటువంటి కష్టదశలో కూడా సమయస్ఫూర్తిని ప్రదర్శిస్తుంది. తన నగల నన్నింటిని ఒక మూటగా కట్టి ఋష్య మూక పర్వతముపై పడవేస్తూ " భవిష్యతి కించి దనేన ప్రయో జనమ్ " ( దీనివలన ఏదో ఒక ప్రయోజనము ఉండవచ్చును ) అని భావిస్తుంది. ఇది ఆమె సమయస్ఫూర్తిని సూచిస్తుంది. ఆ నగల మూలమున భవిష్యత్తులో సీత సమాచారాన్ని శ్రీరామచంద్రుడు తెలుసుకోగలుగుతాడు.

సీత యొక్క పాతివ్రత్య ప్రతాప సౌందర్యమును గురించి " సుందరకాండలో " వాల్మీకి చక్కగా వర్ణించాడు. అశోక వనంలో కూరులైన రాక్షసస్త్రీలమధ్య రావణుడి బందీగా నున్నప్పుడు సీత వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా కనపడుతుంది. రాక్షస స్త్రీల మాయాజాలాలకు,రావణుని బెదరింపులకు ఏమాత్రంలొంగక, భయపడక 12 నెలలపాటు అశోకవనంలో ఆహార నిద్రాదులను సహితం విడనాడి నిర్భయంగా జీవితాన్ని గడిపింది. యమయాతన

లను అనుభవించింది. అయినప్పటికి తన శీలాన్ని కాపాడుకుంది. లక్ష్యాన్ని సాధించేంత వరకు విశ్రాంతినే ఎఱుగదు.

శ్రీరామచంద్రుని గురించి హీనంగా, తేలికగా అవహేళన చేస్తున్న రాక్షసస్త్రీలకు చక్కటి సమాధానం ధైర్యంగా చెప్పింది.

**" దీనోవా రాజ్య హీనోవా యోమే భర్తా సమేగురుః**
**తం నిత్య మనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా "**

" దీనుడుగాని లేక రాజ్యహీనుడుగాని నా భర్తయే నాకు పూజ్యుడు. సూర్యుని యందు సువర్చలవలె నే నతనియందు నిత్యానురక్తనై యుందును " అని సీత తన భర్తను గురించి సగర్వంగా, ధైర్యంగా రాక్షస స్త్రీలకు చెప్పుకుంటుంది. నా అనే వాళ్ళు దరిదాపుల్లో ఒక్కరూ లేకపోయినప్పటికి, అంత ధైర్యంగా సమాధానం చెప్పగలగడం సామాన్యమైన విషయంకాదు. ఆమె యొక్క మహత్తరమగు సౌశీల్య బలం, నైతిక శక్తులు మాత్రమే ఆ విధముగా పలికించాయి. శీల వృత్తసంపన్నులు మాత్రమే అధర్మమును ధైర్యంగా ఎదుర్కొన గలుగుతారు. నైతిక, ఆధ్యాత్మిక శక్తిసంపన్నులు దుష్టులకు అసలే తల ఒగ్గరు. సీతవంటి నిస్సహాయులకు శీలమే శ్రీరామరక్ష.

రావణుడు ప్రతినిత్యం అశోకవనమునకు రావడం, సీతను ప్రాధేయ పడడం, అర్థించడం, చివరకు బెదిరించడం మామూలైంది. తనను వివాహమాడి పట్టమహిషివి కమ్మనమని ప్రాధేయ పడుతాడు. శ్రీరామునిపై ఆశను విడనాడి, తననే ప్రేమించి వివాహం చేసికొని రాజ్యభోగములను తనివితీర అనుభవించమని అర్థిస్తాడు. తన బందీగా వున్న సీతను శ్రీరాముడు విడిపించుట దుర్లభమని, మానవమాత్రులకు అసాధ్యమని భయపెడుతాడు. అయినప్పటికి సీత అంగీకరించదు, చలించదు, భయపడదు. ధైర్యంగా రావణునితో " నీవు నన్ను చూచి భ్రమించితివి.

జంబుకమువంటి నీవు, ఆడు సింగము వంటి నేను దుర్లభురాలు నని యెఱుగుము. నీకు ఆయుర్దాయము పూర్తి కావచ్చి నట్లున్నది. లేనిచో రాఘవుని భార్య యగు నన్ను కోరవు. ఒకవేళ వజ్ర ధరుడగు ఇంద్రుని భార్య యగు శచీదేవిని అవమానించి బ్రతికిన బ్రతకవచ్చు నేమో గాని, శ్రీరామచంద్రుని భార్య నగు నన్ను బలాత్కారము గావించి బ్రతుకుట దుర్లభం. ఒకవేళ నీవు అమృతమును త్రావి యుండినను, మృత్యువును మాత్రం తప్పించుకొనజాలవు" అని సీత రావణుని హెచ్చరించుతుంది. పాతివ్రత్య మహిమను గురించి ధైర్యంగా చెబుతుంది. "పతివ్రత యగు నన్ను అవమానించినచో అష్టైశ్వర్యములతో తులతూగు తున్న లంకాపురి సర్వనాశనం అయి తీరుతుందని శాపిస్తుంది. పర స్త్రీలను పరాభవించువారికి పరాభవం తప్పదని హెచ్చరిస్తుంది. ఐశ్వర్యాన్ని, ధనాన్ని, స్వర్గలోక సుఖాలను చూచి ఆశపడి శరీరాన్ని అమ్ముకునేటువంటి నీచురాలను కాదని స్పష్టం చేస్తుంది. రామలక్ష్మణుల బలపరాక్రమాదుల ముందు నిలవగల శక్తి రావణునికి లే" దని చెబుతూ "నీవు వారికంటే గొప్పవాడివే యైనచో, ఆశ్రమంలో ఒంటరిగా నున్న దొంగవలె అపహరించ వలసిన గతి యెందుకు పట్టినది అని సూటిగా ప్రశ్నిస్తుంది. "సింహ వ్యాఘ్ర సదృశులగు రామలక్ష్మణులతో పోల్చిన, నీవు కుక్కవంటివాడవు. వారి ముందు నిలుచునే అర్హత నీకు లేదు" అని సీత స్పష్టం చేస్తుంది. ఆమె ఆత్మ విశ్వాసానికి ఈ సంఘటన ఒక మచ్చుతునక. ఆమె ఒక మహాశక్తి. ఆ శక్తికి మూలం ఆమె పాతివ్రత్య నిష్ఠయే. ఆ శక్తిని చూచి త్రిలోకవిజేత యైన రావణుడు సహితం కంపించిపోయాడు.

సహజంగా మానవుడు కష్టాలలో చిక్కుకుని వున్నపుడు, ధైర్యమును విడనాడి దైన్యమును పొందును. నిస్సహాయ స్థితిలో నున్నపుడు నైతికస్థాయి దిగజారును. నా అన్న వారందరికీ

దూరమై ఏకాకిగా కాలం గడుపవలసి వచ్చినపుడు శీలభ్రష్టు లగుదురు. అవాంతర పరిస్థితులు వచ్చి పై బడినప్పుడు ఏమి చేయాలో తోచక అయోమయ పరిస్థితిలోపడి ఆత్మహత్యకు పడికట్టుదురు. ఈ దుర్బల పరిస్థితు లన్నింటిని సీత ఏక కాలంలో ఎదుర్కొంటున్నప్పటికి ఏమాత్రం చలించలేదు. ఏటు చూచినా నూరు యోజనాల సముద్రం. నా అన్న వారెవ్వరూ సమీపాన లేరు. కళ్ళు తెరిస్తే కనిపించేది అతి క్రూర భయంకరులైన రాక్షస మూకలు, వారు పెట్టే బాధలు; వినిపించేవి రావణుని బెదిరంపులు. అటువంటి భీకర, భయంకర వాతావరణంలో నిస్సహాయురాలై ఏకాకిగా వుండి కూడా ఏమాత్రం చలించక, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవక, ధైర్యాన్ని విడనాడక, పరిస్థితుల ప్రభావానికి లొంగక, రావణుని అష్ట ఐశ్వర్యములకు మోహపడక, భారతీయ నారీత్వ ఔన్నత్యమును ముల్లోకములకు ఎఱుకపరచినది. భారతస్త్రీకి 'పాతివ్రత్యము' అనునది ఒక మహత్తర మగు తపమని, అట్టి తపోనిష్ఠురాండ్రగు స్త్రీలను వంచించువారు యెంతటి బలపరాక్రమసంపన్నులైనను, అగ్నిలో పడిన మిడతల వలె దగ్ధమై పోవుదురని సీత తన ప్రవర్తన ద్వారా ఋజువు చేసినది. ఎన్నికష్టము లొచ్చినను వాటిని లెక్కచేయక ధైర్యంతో ఎదిరించి పోరాడగల ఆత్మబలం, నైతికశక్తి భారతస్త్రీలకు కలదని సీతాదేవి నిరూపించింది. సౌశీల్యమనే మహాశక్తిని కలిగివున్నవారు భౌతిక శక్తికి తలవంచ నవసరంలేదని సీతాదేవి ప్రపంచానికి చాటింది.

అశోకవనంలో ఉన్న సీత యొక్క విషాదకర పరిస్థితిని హనుమంతుడు కళ్లారా చూచి ఎంతో వ్యధ జెంది "నీవు నా వీపుపై ఎక్కుము. నిన్ను శ్రీరాముని దగ్గరకు క్షేమంగా చేరుస్తాను" అని సీతతో అంటాడు. కాని సీత అంగీకరించదు. స్వాభిమానం అడ్డు తగులుతుంది. "నీచకార్య మాచరించిన

రావణుని, అతని అనుచరగులగు రాక్షసులను సంహరించి, నన్ను తీసుకొని వెళ్ళినచో, అది శ్రీరామునికి తగినట్లుండును " అని సీత ప్రత్యుత్తర మిస్తుంది. ఈ మాటలు ఆమెయొక్క స్వాభిమాన మును, అనన్య పతినిష్ఠను, భర్తయొక్క బలపరాక్రమాదుల యందు అమోఘమగు విశ్వాసము ప్రకటిత మవుతున్నాయి. అవకాశం లభించింది కదాయని తొందరపడి హనుమంతునితో బయలుదేరి వెళ్ళడానికి సీత అంగీకరించలేదు. కారణం, రావణుడు ఏ విధముగా దొంగతనముగా రామలక్ష్మణులు లేని సమయంలో తనను అపహరించాడో అదేవిధముగా శ్రీరాముడు హనుమంతుని ద్వారా రహస్యంగా తనను తీసుకొని వెళ్ళాడనే అపవాదు శ్రీరామునికి కూడా వచ్చి తీరుతుందని సీత అభిప్రాయ పడింది. తాను హనుమంతునితో వెళ్ళితే శ్రీరాముడి పరాక్రమాన్ని లంకేశ్వరుడు, రాక్షసులు చవి చూచే అవకాశం లేకుండా పోతుందని విచారించింది. రామబాణ మహిమ రావణునికి అర్థమయ్యే అవకాశం పోతుందేమోనని బాధపడింది. ఎంతటి కష్టాలనైనా భరించడానికైనా అంగీకరించింది గాని శ్రీరామునికి అపవాదు రావడానికి మాత్రం సుతరామూ సీత యిష్టపడి యుండ లేదు. ఒక వైపు భర్త వియోగ బాధను సహిస్తూ, మరొక వైపు రావణుని బెదిరింపులకు భయపడక, రాక్షసస్త్రీలు పెట్టే బాధలను భరిస్తూ, ఓర్పుతో తనను తాను ఓదార్చుకుంటూ, ఓర్మిని వహించి, సహనంతో సంవత్సర కాలంపాటు అనేక కష్ట నష్టాల కోర్చి ఆత్మస్థైర్యాన్ని ప్రదర్శించిన సాధ్వీమణి, సౌశీల్యవతి సీతాదేవి.

సీత యొక్క పాతివ్రత్య మహిమను రావణుని భార్య మండోదరి సహితం గుర్తించింది. రావణ వధానంతరం మండోదరి మృతదేహంమీద పడి విలపిస్తూ "పతివ్రతా యాస్తప సానూనం దగ్ధోఽసి మే ప్రభో." "నీవు పతివ్రత యగు సీతయొక్క

తేజము చేతనే దగ్ధమైనావు" అని విలపిస్తుంది. సీత యొక్క పవిత్రత, శీలసంపదలను గురించి శత్రువులైన రాక్షసస్త్రీలు సహితం కొనియాడటం విశేషం. మిత్రుడు స్నేహితుని గొప్ప తనాన్ని గురించి పొగడటం సహజం. అతని ఉత్తమ లక్షణాలను గురించి ప్రచారం చేయడం స్వాభావికం. శత్రువులు పొగడడం లోనే వున్నది ప్రత్యేకత. ఇక్కడ అదే జరిగింది. సీతయొక్క ఉన్నత శీల స్వభావాదులు శత్రువులచేత వెల్లడి చేయబడ్డా యంటే, సీతయొక్క గొప్పతనం ఎంత విశిష్టమైనదో మనం బాగా అర్థం చేసుకోవచ్చును.

రావణ వధానంతరం శ్రీరాముడు సీతను యింకా పరీక్షించ దలచుకొని అనరాని మాటలు అందరి ముందర అంటాడు. వినరాని పలుకులు పలుకుతాడు. ఆమె శీలాన్ని సహితం శంకిస్తాడు సీతను పరిగ్రహింప నిరాకరిస్తాడు. లక్ష్మణ, భరత, శత్రుఘ్ను లలో నెవ్వానివద్దగాని; సుగ్రీవ, విభీషణులలో యిష్టం వచ్చిన వారి వద్దగాని పోయి వుండమని నిష్కర్షగా చెబుతాడు, ఆయన వద్దకు రానవసరంలేదని స్పష్టం చేస్తాడు. తాను దైవముగా నారాధించిన భర్త తనను తృణీకరించినందులకు సీత యెంతో వ్యథ జెందుతుంది. ఏ రామునికోసం వత్సరకాలంపాటు పడరాని పాట్లు పడుతూ నిరీక్షించిందో, ఆ రాముడే ఎదురుగా కనపడి నిర్మోహమాటంగా నిరాకరించినందులకు సీత విలవిలలాడిపోతుంది. అయినప్పటికి సీత ఓర్పును విడనాడదు. సహనాన్ని కోల్పోదు. ఓర్మిని ప్రదర్శిస్తుంది. రామాజ్ఞానుసారము లక్ష్మణుడు చితిని పేరుస్తాడు. ప్రజ్వలింప జేసిన ఆ అగ్నికి ఆహుతి కావడానికి సీత నిర్ణయించు కొంటుంది. శ్రీరామునికి ప్రదక్షిణం చేస్తుంది. అగ్నిలో దుమికే ముందు దేవతలకు ప్రణామం చేస్తూ "నాయొక్క హృదయము నిత్యము రాఘవుని తప్ప యితరుని మీదకు పోకుండ నున్నచో, నన్ను సకలవిధముల అగ్నిదేవుడు రక్షించుగాక!" అని అగ్నిలో

ప్రవేశిస్తుంది. ఆ భయంకర సన్నివేశాన్ని చూచుచున్న వారందరూ హాహాకారాలు చేస్తారు. ఇంతలో అగ్ని ఆరిపోతుంది. సీత చెక్కు చెదరకుండ నిలబడి వుంటుంది. దేవతలు ప్రత్యక్ష మవుతారు. సీతయొక్క శీల మహాత్త్వమును ప్రశంసిస్తారు. "ఓ రామా! పాపరహితమగు సీతను పరిగ్రహింపుము" అని ఆదేశిస్తారు.

రావణుడు ఎన్నివిధములగు ప్రలోభములను చూపినను, ఎంత బెదిరించినను సీత తన మనస్సును మార్చుకోలేదు. తన మనస్సులో శ్రీరామునికి తప్ప మరొకరికి స్థానం యివ్వలేదు. జీవితం అనేక కష్టాలతో కూడుకొని వుంటుంది. మానవుడు అనేక వేదనలను అనుభవించవలసి వస్తుంది. బాధలను ఎదుర్కొన వలసి వస్తుంది. కొన్ని సమయాలలో వాటిని గురించి బహిరంగంగా మాట్లాడటానికి కూడా అవకాశం వుండదు. చెప్పుకొని మనశ్శాంతిని పొందుదామా అంటే ప్రక్కన ఎవ్వరూ కనిపించరు. ఏకాకిగా జీవితాన్ని గడుపవలసి వస్తుంది. తా నారాధించిన దైవము ప్రత్యక్షమై, యిక కష్టాలు నెరవేరినాయి గదా యని భావిస్తున్న సమయంలో పిడుగులాంటి వార్తను వినవలసి రావడం నిజంగా దురదృష్టకరం. ఏ వ్యక్తి కోసం ఇంతకాలం తహతహ లాడిందో, క్షణం ఒక్క యుగంగా గడిపిందో ఆ వ్యక్తే కనపడి నిర్దాక్షిణ్యంగా నిరాకరించడం జరిగినప్పుడు, ఆ హృదయం ఎంత పరితపిస్తుందో ఊహించడం కూడా కష్టమే అవుతుంది. జీవితంలో నిజంగా అది ఒక అగ్ని పరీక్ష. అటువంటి పరీక్షకు సామాన్యులు తట్టుకోవడం కష్టమే అవుతుంది. జీవితంలో సంభవించే పోరాటాలు, పరస్పర సంఘర్షణలు కొంత నిరాశను కలుగజేస్తాయి. పెట్టుకున్న ఆశలు అడియాసలుగా మారిపోతున్నాయి గదా యని, కనిన కలలు కల్లలవుతున్నాయని నిస్పృహ చెందుతారు. జీవిత పోరాటంలో ఓడిపోయానని భావిస్తారు. జీవితం మీదనే విరక్తి జనిస్తుంది.

కాలగర్భంలో కలిసిపోతారు సామాన్యులు. చరిత్రహీనులు అవుతారు.

మహనీయులు మాత్రం అది ఒక సవాలుగా స్వీకరిస్తారు. పై పైకి వచ్చి పడుతున్న అవాంతరాలకు, ఆపదలకు ఉక్కిరి బిక్కిరి కాకుండ నిలద్రొక్కుకుని మేరుపర్వతంలా కదలకుండా నిలచుంటారు. అసలు మానవునియొక్క వ్యక్తిత్వం కష్టముల లోనే వికసిస్తుంది. ఆపదలు సంభవించినప్పుడు, విషమ పరిస్థితులు దాపురించినప్పుడు కూడా భయపడక, ఆత్మస్థైర్యమును కోల్పోవక, ధీరతతో పరిస్థితులను ఎదుర్కొని లక్ష్యమును సాధించునంతవరకు విశ్రమించరు. బ్రతికియున్నంత వరకు ధర్మమును విడనాడరు. సీతాదేవి ఆ కోవకు జెందినదే.

ఆమె ఉదార స్వభావం, క్షమ, శీలము అద్వితీయములు. లంకాపురిని జయించిన తరువాత, సీతను హింసించిన రాక్షస స్త్రీల మీద హనుమంతుడు ప్రతీకారం తీసుకుంటా నంటాడు. వారందరిని తుదముట్టించుతా నని చెబుతాడు. కాని సీత అటువంటి ఘోర కృత్యాలను ప్రోత్సహించదు. అంగీకరించదు కూడాను. రాజసేవాతత్పరులైన ఆ భృత్యుల మీద ప్రతీకారం తీసుకోవడం ధర్మం కాదని వాదిస్తుంది. పూర్వజన్మలో ఏదో ఒక పాపం చేసియుండుటవల్లనే ఇటువంటి కష్టాలు తనకు దాపురించి వుంటాయని, దానికి వారు బాధ్యులు కాదని వాదిస్తుంది. తాను అప్పుడు దిక్కులేనిది కావడంవల్లనే తనను ఆ దాసీజనం బాధించడం జరిగిందని, అది వారి తప్పు కాదని, ప్రభువాజ్ఞను మన్నించడం వారి ధర్మమని చెబుతుంది. ప్రభువుని కోల్పోయి నిస్సహాయులై వున్న ఆ దాసీ జనాన్ని హింసించడం వివేకులకు తగిన పని కాదని స్పష్టం చేస్తుంది. ప్రాజ్ఞులైన వారు ప్రత్యపకారం చేయడం విజ్ఞత లక్షణం కాదని వాదిస్తుంది. దీనినిబట్టి ఆమె క్షమా

శీలము, శత్రువుల యందు కూడా ఆమె చూపిన కరుణ, దయ సామాన్యస్త్రీకి వుండవలసినవి కావనే విషయం ఋజువవు తున్నాయి. ఆమె ఉదార స్వభావమునకు త్రిజట మొదలగు రాక్షసస్త్రీలు సహితం ఆశ్చర్యచకితులై ప్రశంసిస్తారు. పొగడుతారు. ఆమెకు పాదాభివందనం కూడా చేస్తారు. ఆమె ప్రవర్తన శత్రువులను సహితం మంత్రముగ్ధులను గావించింది. అంతేకాదు వారిలో పరివర్తనను కూడ తెప్పించింది.

శ్రీరామచంద్రుడు లోకోపవాదమును పురస్కరించుకొని, నిండుచూలాలుగా వున్నదని కూడ యోచించక, నిర్దాక్షిణ్యంగా అడవులపాలు చేసిన విషమ సమయమున కూడ తన భర్తను గురించి ఒక్క పరుషమైన మాటను కూడ మాట్లాడదు ఆ పరమ సాధ్వీమణి సీతాదేవి. పైపెచ్చు ఆయన క్షేమమును, హితవును కోరుకుంటుంది. ఆమె తన శీల వృత్తముల చేతను, క్షమ కరుణల తోడను, స్నేహ వాత్సల్యముల తోడను సర్వలోకములను ఆశ్చర్యచకితులను గావించింది. భారత నారీ మహత్త్వమును లోకము ముందుంచింది. సకల స్త్రీజాతికి ఆదర్శ దైవముగా పేరు గాంచింది. భారత నారీ గౌరవ ప్రతిష్ఠ లను యినుమడింప జేసింది. అందుకే ఆమె చరిత్ర సకల నారీ లోకానికి గర్వకారణమైనది.

సీతాదేవి ఆదర్శ గృహిణి. పాతివ్రత్య తేజమునకు, నిర్మలత్వమునకు, మాతృ వాత్సల్యమునకు, దయ, ప్రేమ, కరుణ మొదలగు అత్యున్నతములైన సద్గుణాలకు ఆమెకు ఆమే సాటి. సుఖమునందు దుఃఖమునందు, నగరమున అరణ్యమున, సంయోగమున వియోగమున, సర్వకాల సర్వావస్థల యందు ఒకే విధముగా జీవితాన్ని గడిపి ఒక మహత్తర ఆదర్శమును ప్రపంచము ముందు వుంచి భావికాలాలవారికి స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించిన సౌశీల్యవతి. సీతాదేవి

# లక్ష్మణుడు

లక్ష్మణుని భ్రాతృ భక్తి వర్ణనాతీతము. మహా వీరుడే కాదు, మహా త్యాగి కూడాను. అనుశాసన ప్రియుడు, జితేంద్రియుడు. పరస్త్రీలను మాతృభావనతో చూడగల పరమోత్కృష్టమైన ఉత్తమ శీలసంపన్నుడు. ఎవ్విధమైన రాజ్యభోగములను ఆశించకుండా, ఉన్నవాటిని కూడా త్యజించి తన జీవిత సర్వస్వమును శ్రీరామచంద్రునికి సమర్పించిన త్యాగమూర్తి. శ్రీరాముని సేవించుటకు తన స్వసుఖాల నన్నింటిని తృణప్రాయంగా పరిత్యజించిన త్యాగశీలి. లక్ష్మణుడు ప్రక్కన లేకుండగ తన కొఱకు మృష్టాన్నమును తెచ్చినను శ్రీరాముడు భుజించేవాడు కాదు. శ్రీరామచంద్రుడు గుఱ్ఱము ఎక్కి వేటకు వెళ్ళినప్పుడు, ధనుర్ధారియై అతని వెంట లక్ష్మణుడు అంగరక్షకుడుగా వెళ్ళేవాడు. వారిద్దరి శరీరములు వేరుగా కన్పించినప్పటికి మానసికంగా వారిద్దరూ ఒక్కటే. అందుకే వాల్మీకి మహర్షి లక్ష్మణుని గురించి "ద్వితీయం మేఽన్తరాత్మనం; బహిఃప్రాణ ఇవాపరః; రామస్య దక్షిణో బాహుః" (శ్రీరామునికి లక్ష్మణుడు రెండవ అంతరాత్మ, బహిఃప్రాణం, కుడి భుజము వంటివాడు) మొదలగు విశేషణములను ప్రయోగిస్తాడు.

దశరథుడు తనకు యౌవరాజ్యాభిషేకము చేయునని తెలిసిన వెంటనే శ్రీరాముడు లక్ష్మణుని పిలిచి "నీవు నాతో కలసి వసుంధరను పాలింపుము. నీవు నాకు రెండవ అంతరాత్మవంటివాడవు. నాకు లభించిన ఈ భాగ్యము నీకునూ లభించినట్లుగా

భావింపుము '' అని చెబుతాడు. ఈ వాక్యములను బట్టి లక్ష్మణుని మీద ఎటువంటి మమకారం వుండేదో అర్థమౌతుంది.

శ్రీరామచంద్రుడు అరణ్యావాసమునకు బయలుదేరినప్పుడు లక్ష్మణుడు కూడా సిద్ధమవుతాడు. శ్రీరాముడు వద్దని వారిస్తాడు. కాని లక్ష్మణుడు ససేమిరా అంగీకరించడు. '' నీవు లేకుండగ త్రిలోకైశ్వర్యము నిచ్చినను నేను దానిని కోరను '' అని స్పష్టంగా చెప్పి శ్రీరాముని వెంబడిస్తాడు. అరణ్యావాసంలో శ్రీరామునితో సకల కష్టాలను అనుభవిస్తాడు. తండ్రి ఆజ్ఞానుసారం శ్రీరాముడు అరణ్యావాసమునకు వెళ్ళుతాడు. లక్ష్మణుడు మాత్రం తనంతటతానే సకల రాజభోగ భాగ్యములను స్వయంగా త్యజించి తల్లిని, భార్యను వదిలి శ్రీరాముని అనుసరించడంలోనే వున్నది లక్ష్మణుని త్యాగనిరతి.

లక్ష్మణుడు తండ్రియైన దశరథుని కంటే శ్రీరామచంద్రునే అమితంగా ప్రేమించేవాడు. శ్రీరాముని అరణ్యావాసమునకు పంపినందులకు తండ్రిని సహితం నిందించుతాడు. మంచి చెడులను గురించి ఆలోచించకుండా, అవివేకంతో తండ్రి చేసిన నిర్ణయమునకు మిక్కిలి దుఃఖించుతాడు. మహారాజైన దశరథుని యందు పితృ ధర్మము కనిపించడంలేదని ఆరోపిస్తాడు.

**" భ్రాతా, భర్తాచ, బంధుశ్చ పితాచ మమరాఘవః "**

" సోదరుడు, ప్రభువు, బంధువు, తండ్రియును నాకు శ్రీరామచంద్రుడే '' అని లక్ష్మణుని వచనములను బట్టి శ్రీరామచంద్రుని యెడల అతని ప్రేమాభిమానములు స్పష్టమగుచున్నవి. సోదరప్రేమ ఔన్నత్యాన్ని తన జీవన గమనం ద్వారా నిరూపించి, అనుసరించి, చూపించిన ఆదర్శ భ్రాతృభక్తి పరాయణుడు లక్ష్మణుడు.

సీతారాముల వివాహమైన తరువాత పండ్రెండు సంవత్సరములు అయోధ్యలోను, పదమూడు సంవత్సరములు అరణ్యాము

లోను వారికి సహచరునిగా వున్ననూ సీతయొక్క మోమును లక్ష్మణుడు చూచి ఎఱుగడు అంటే నమ్మశక్యము కాని విషయమే, కాని ఇది వాస్తవం, యథార్థం. ఇటువంటి మహావృత్త సంపన్నుడు, సౌశీల్యవంతుడు మనకు ప్రపంచ చరిత్రలో ఎక్కడా కనిపించడు.

సీతాదేవి ఋష్యమూక పర్వతంపై వదిలిన నగలమూటను శ్రీరామచంద్రునికి సుగ్రీవుడు యిస్తాడు. ఆ మూటను లక్ష్మణునికి యిచ్చి "ఆ నగలు మీ వదినవేమో చూడుము" అని ఆదేశిస్తాడు. అప్పుడు లక్ష్మణుడు ప్రత్యుత్తరమిస్తూ.

**"నాఽహం జానామి కేయూరే నాఽహం జానామి కుండలే**
**నూపురే త్వభి జానామి నిత్యం పాదాభివందనాత్."**

"నేను సీతాదేవి యొక్క బాహువులపై గల దండ కడియములను ఎఱుగను. ఆమె చెవులకు ధరించు కుండలములను ఎఱుగను. నేను ప్రతినిత్యము పాదములకే నమస్కరించు చుందును గాన ఆమె పాదములపై గల అందెలను మాత్రమే ఎఱుగుదును" అని ప్రత్యుత్తర మిస్తాడు. ఈ సంఘటన లక్ష్మణుని నిర్మల సచ్ఛీల చరిత్రను ఋజువు చేస్తున్నది. రామాయణ మహాకావ్యంలో ఈ శ్లోకము మకుటాయమైనది. వదినగారి యెడల లక్ష్మణుని మాతృభక్తి ఎంతటి పవిత్రమైనదో తేటతెల్లమౌతున్నది.

ఇటువంటిదే మరొక సంఘటన ఎంతటి పాషాణ హృదయాలనైనా కరగించి వేస్తుంది.

శ్రీరాముని ఆజ్ఞానుసారము సీతను మునియాశ్రమముల వద్ద వదలిపెట్టడానికి లక్ష్మణుడు తీసికొని వెళ్ళుతాడు. తిరిగి వచ్చేటప్పుడు లక్ష్మణునితో "నాయనా! నీ అన్న నన్ను విడిచి నందులకు ఆయనపై నాకు ఎట్టి కోపమూ లేదు. నేను

పరిశుద్ధురాలనని తెలిసి కూడ లోకోపవాదమును భరించలేక నన్ను విడిచిపెట్టినాడు. ధర్మమును పాలించుటయు, కర్తవ్యమును నెరవేర్చుటయు నాకు గూడా సమ్మతమే. నా శరీరమును గూర్చి నేను ఆలోచించను. ప్రాణములను త్యజించి అయినను భార్య భర్తకు ప్రియము చేయవలెను. కాని గర్భవతియగు నన్ను చూచి, నీవు విడిచి వెళ్ళకుము '' అని సీత దీనురాలై పలుకగా లక్ష్మణుని హృదయం కలచివేస్తుంది. తల వంచుకొని కుమిలి కుమిలి చివరికి బావురుమని పెద్దగా విలపిస్తాడు. తల వంచుకొని ఆమెకు ప్రదక్షిణంచేసి, దుఃఖమును దిగమ్రింగుకొని సీతతో

**" దృష్ట పూర్వం నతే రూపం పాదౌ దృష్టా తవానఘే**
**కథ మత్రహి పశ్యామి రామేణ రహితాం వనే. "**

'' ఓ పాపరహితురాలా ! నీ పాదములు తప్ప యిదివరకు నిన్ను నేను ఎన్నడునూ చూచి యెఱుగను. రాముడు ప్రక్కన లేనప్పుడు ఈ వనమున నున్న నిన్ను నేనెట్లు చూడగలను ? '' అని లక్ష్మణుడు ధర్మసందేహాన్ని వెలిబుచ్చుతాడు.

ఈ రెండు సంఘటనలనుబట్టి లక్ష్మణుని శీల స్వభావము ఎంతటి ఉన్నతమైనదో మనం అర్థం చేసికోవచ్చును. పరస్త్రీలను కన్నెత్తి యయినా చూడని ఉత్తమశీల సంపన్నుడు లక్ష్మణుడు. శీలము వుండవలసినది ఒక్క స్త్రీలకు మాత్రమే గాదని, పురుషులు కూడా సౌశీల్యవంతులైనప్పుడే సత్సంప్రదాయాలు గల సమాజం రూపొందగలుగుతుందని మన పూర్వీకుల దృఢ నిశ్చయం. శీలమే జీవునికి అలంకారం. సచ్ఛీలమే ధనము. సదాచారమే సంపద. ప్రతిజీవికి శీలం ప్రాణాధారం. శీలం లేని శక్తి నిష్ప్రయోజన మవుతుంది. శీలంలేని వ్యక్తి అప్రతిష్ఠపా లవుతాడు. శీల రహితుడు సమాజం పాలిటి చీడపురుగు. శీలముపైననే సమస్తమూ ఆధారపడి వున్నది.

రావణాసురుడు భౌతికశక్తుల నన్నింటిని తన అరచేతిలో యిరికించుకో గలిగినాడు. సమస్తాధికారములు సంపాదించాడు. సకల భోగభాగ్యములను సమకూర్చుకోగలిగినాడు. సర్వాధికారాలను పొందాడు. అతనికి ఎదురుగా నిలచి ఎదిరించగల శక్తి ముల్లోకములలో ఎక్కడా కనిపించలేదు. అయినప్పటికి అతనికి పతనం తప్పలేదు. కారణం ? అన్ని శక్తులను సంపాదించ గలిగినప్పటికి 'శీలం' అనే శక్తిని మాత్రం సంపాదించలేక పోయినాడు. శీలంలేని శక్తి నిష్ప్రయోజనమని, రావణాసురుని విషయంలో ఋజువైనది.

శ్రీరామచంద్రునిపట్ల అతనికి గల ప్రేమ వర్ణనాతీతం. 'కబంధుడు' అను రాక్షసుడు రామ లక్ష్మణులను బంధించినపుడు, లక్ష్మణుడు అన్నయందు కనపరచిన ప్రేమ, భక్తి అసాధారణమైనవి. ఆ సంకట పరిస్థితిలో కూడా లక్ష్మణుడు ఎంతో ఉదాంతతో ప్రవర్తిస్తాడు. సమయస్ఫూర్తితో కర్తవ్యాన్ని ప్రబోధిస్తాడు. "ఓ రామా ! నన్ను గూర్చి ఆలోచింపకుము. నన్ను ఈ కబంధునికి బలిగా నర్పించి నీవు సుఖముగా పో. కొద్దికాలంలోనే నీకు తప్పకుండా వైదేహి లభ్యమవుతుంది. వనవాసమును పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యకు వెళ్ళి సుఖముగా రాజ్యమును పాలింపుము" అని లక్ష్మణుడు శ్రీరాముని వేడుకుంటాడు. బ్రతిమాలుకుంటాడు. తన యన్నకొఱకు తనశరీరమును సహితము బలిగ నర్పించడానికి లక్ష్మణుడు ఏమాత్రం వెనుకాడడు, సంకోచించడు. తన జీవిత సర్వస్వమును శ్రీరామచంద్రునికి సమర్పించిన మహానుభావుడు. తన స్వసుఖాలను వదలుకొని, శ్రీరాముని సుఖం కోసం కష్టాలను నవ్వుతూ, నవ్వుతూ స్వీకరించిన మహావ్యక్తి. తన సర్వస్వాన్ని శ్రీరాముని పాదపద్మాలకు సమర్పించి, లోకమునకు త్యాగంయొక్క పరాకాష్టను చూపించి, తన జీవితమును సార్థక్య మొనర్చుకొనిన మహాత్యాగశీలి లక్ష్మణుడు. అతని ప్రేమ, దయ, కరుణ,

అనురాగము. భ్రాతృభక్తి, సౌశీల్యం, త్యాగం, అన్నిటికీ మించిన కర్తవ్యపాలన నేటి పరిపాలకులు, పౌరులు ఆదర్శముగా గైకొన గలిగిన శుభదినాన, ఈ దేశంలో తిరిగి 'రామరాజ్యం' అవత రించి తీరుతుంది.

లక్ష్మణుడు త్యాగశీలి. అతని జీవితమే త్యాగమయము. రాజ్యాధికారములపైన గాని, రాజ్యభోగములపైన గాని అతనికి ఎట్టి మమకారంలేదు. మక్కువ అసలే లేదు. శ్రీరామచంద్రుడు పట్టాభిషిక్తుడైన తరువాత, లక్ష్మణుని యువరాజ పదవిని స్వీకరించ మని కోరుతాడు. ఎంత బలవంతం చేసినప్పటికి లక్ష్మణుడు అంగీకరించడు. శ్రీరాముని ప్రయత్నం ఫలించకపోవడంవల్ల యౌవరాజ్యాభిషిక్తునిగా భరతుడినే చేస్తాడు. ఈ సంఘటనను బట్టి లక్ష్మణునికి అధికార వ్యామోహం అసలే లేదనే విషయం స్పష్టమౌతున్నది. శ్రీరామునితో అడవులకు వెళ్ళడానికి, కష్టా లను పంచుకోవడానికి లక్ష్మణుడు ఎవరూ కోరకుండానే, తనంతట తానే ముందుకు వచ్చాడు. యువరాజ పదవిని స్వీకరించమని శ్రీరాముడు కోరినప్పటికి తిరస్కరించాడు. రాజ్యలక్ష్మి ముందుకు వచ్చి తనను స్వీకరించి, అనుభవించమని ప్రాధేయపడినప్పటికి, తృణప్రాయంగా నిరాకరించే నిస్వార్థపరులు, ఒక్క మన భారత దేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా కనిపించరేమో! లక్ష్మణుని లాంటి స్వార్థత్యాగులను ఆదర్శముగా గైకొనగలిగిన నాడు ప్రపంచంలో ద్వేషాలకు, కావేషాలకు, కార్పణ్యాలకు తావే వుండదు. అధికార వ్యామోహంతో చేయరాని పనులు చేస్తూ, మారణహోమాలను సృష్టించడానికి కూడా ఏ మాత్రం వెనుకాడ నటువంటి ప్రస్తుత సమాజానికి లక్ష్మణుని ఆదర్శం, త్యాగం పరిష్కారమార్గాన్ని చూపించగలుగుతాయి. స్వార్థమే జీవిత పరమావధిగా నెంచి, అధికారంకోసం ఎంతటి నీచానికైనా వెరువని పచ్చి అవకాశవాదులు సహితం ఒక్క పర్యాయం రామాయణ

మహాకావ్యమును చదివిన యెడల మానసిక పరివర్తన జెందగలరు. లక్ష్మణుని సచ్ఛీల, నిస్వార్థ, త్యాగ మయమయిన జీవితం అట్టివారికి కనువిప్పు కాగలదు. నేటి పరిపాలకులు, నాయకులు లక్ష్మణుని ఆదర్శముగా గైకొనిన యెడల వైషమ్యాలకు, వైరుధ్యాలకు తావే వుండదు.

లక్ష్మణుడు కర్తవ్యపాలన విషయంలో కూడ పరమ కఠోరుడు. శ్రీరామచంద్రుడు ఒక పర్యాయం బ్రాహ్మణ వేషంలో వచ్చిన కాలయమునితో రహస్య సంభాషణలు చేయ వలసి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని ద్వారంవద్ద కాపలా వుంచి, ఎవరైనా ఆ సమయంలో లోపలికి వచ్చిన గాని, తమ సంభాషణలు వినినగాని, అట్టి వాని తల తీసివేయడం జరుగుతుందని హెచ్చరిస్తాడు. అన్న యాజ్ఞప్రకారం లక్ష్మణుడు కాపలా కాస్తుంటాడు. ఇంతలో దుర్వాస మహర్షి వచ్చి తక్షణమే శ్రీరాముని దర్శించవలెనని వత్తిడి చేస్తాడు. లక్ష్మణుడు ససేమిరా అంగీకరించడు. దుర్వాసునికి కోపం వస్తుంది. తన రాకను శ్రీరామునికి వెంటనే తెలియబరచని యెడల అయోధ్యా రాజ్యం, రాజ సంతతి, ప్రజలు యావత్తూ సర్వనాశనం అయ్యేట్లుగా శపించుతానని హెచ్చరిస్తాడు. లక్ష్మణునికి సంకట పరిస్థితి ఏర్పడుతుంది. తనవల్ల దేశం యావత్తూ సర్వనాశనం కావడానికి మనస్కరించదు. తానొక్కడూ శ్రీరాముని ఆగ్రహానికి గురియై మరణించినా పరవాలేదని భావిస్తాడు. దేశం, ప్రజలు మాత్రం సుఖ శాంతులతో జీవించి వుండాలని తలుస్తాడు. తీవ్రంగా ఆలోచించి లోపలికి వెళ్ళి శ్రీరామునితో దుర్వాసుని రాకను తెలియబరుస్తాడు. కాలయముని పంపించి దుర్వాసుని ఆహ్వానించి, మృష్టాన్నముచే తృప్తి పరచి, శాంతింపజేసి అతనిని కూడా పంపిస్తాడు శ్రీరామచంద్రుడు. శ్రీరాముడు దీర్ఘాలోచనలో పడి, తన ప్రతిజ్ఞ ప్రకారం తన అనుంగ తమ్ముడు లక్ష్మణుని వధించవలసి వచ్చినందుకు విచారిస్తుంటాడు.

అప్పుడు లక్ష్మణుడు శ్రీరాముని వద్దకు వెళ్ళి "నా కొఱకు విచారింపకుము. నన్ను వధించి ప్రతిజ్ఞను పాలింపుము. ప్రతిజ్ఞను పాలింపని నరులు నరకమును పొందుదురు. సంశయింపకుము. నన్ను వధించి ధర్మమును వృద్ధిచేయుము" అని కర్తవ్య పాలనను గురించి చెబుతాడు. తనను చంపి ప్రతిజ్ఞను పాలించమని వేడుకుంటాడు. తన ప్రాణములను సహితం నవ్వుతూ నవ్వుతూ అర్పించడానికి సిద్ధమవుతాడు. శ్రీరామునికి ఏమి చేయాలో తోచదు. ఒకవైపు ప్రతిజ్ఞా పాలన, మరొకవైపు తనను మనసారా ప్రేమిస్తూ, సేవిస్తున్న సహచరుడు, అనుంగు తమ్ముడు. నీతి కోవిదులను పిలిపిస్తాడు. సంకట పరిస్థితిని సవివరముగా వివరిస్తాడు. వారి సలహా ప్రకారం లక్ష్మణుని దేశ బహిష్కారం చేస్తాడు. తనను ప్రేమించిన అన్న చివరకు తనను త్యజించినప్పటికి శ్రీరామునిపై ఏమాత్రం కోపించక లక్ష్మణుడు రామాజ్ఞను శిరసావహించి దేశాన్ని విడిచి వెళ్ళిపోతాడు.

లక్ష్మణుని భ్రాతృభక్తి, ఆదరము, ఔదార్యము, అనుశాసనమునందు గల దృఢవైఖరి, కర్తవ్య పాలన యందు గల కఠోర నియమము, అన్నిటికి మించిన మనోస్థైర్యము తలంచుకుంటే ఎంతటి మూఢుల హృదయాలనైనా ద్రవించి వేయక మానదు. సర్వనాశనమును తప్పించుటకై తన ప్రాణములనైనా త్యజించుటకు సిద్ధపడిన మహాత్యాగశీలి లక్ష్మణుడు. అతనిలో గల అకుంఠితదీక్ష, కర్తవ్యనిష్ఠ భావితరాల వారికి అత్యంత ఆదర్శనీయము.

**"ఆలస్యం చేయకు. చేయవలసిన పనిని వెంటనే చేయాలి. తీరా గట్టు తెగిన తరువాత చెరువుకు కట్ట కట్టడానికి వీలు పడదు. పట్టుదల వదలకు. నీ కార్యం నిశ్చయంగా జయమవుతుంది.**

**— రాజాజీ రామాయణంనుండి**

# 5

## భరతుడు

"న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతో సమాః" 'సోదరు లందరూ భరతుని వంటి వారు కారు' అని శ్రీరామ చంద్రుడు భరతుని భ్రాతృభక్తిని గురించి ముక్తకంఠంతో ప్రశంసిస్తాడు.

రామాయణ పాత్రలలో భరతుని వంటి పరిశుద్ధమూర్తి మరొకడు కానరాడు. భరతుని పవిత్ర చరితమును పరిశీలించిన యెడల ముఖ్యముగ అతనియందు రెండు విశేష గుణములు మనకు గోచరించుతాయి. ఒకటి అతని ధర్మనిష్ఠ, రెండవది అతని భ్రాతృభక్తి. అతని ధర్మనిష్ఠ యనన్య సామాన్యము. దశరథుడే స్వయముగా అతని ధర్మనిష్ఠను ప్రశంసిస్తూ కైకేయితో "రామాదపి హితం మన్యే ధర్మతో బలవత్తరమ్." 'రాముని కంటే కూడ ధర్మవిషయమున భరతుడు చాలా నిష్ఠ గలవాడు' అని అంటాడు. భరతుడు మిక్కిలి నిర్మలమైన హృదయము గలవాడు. అతని మనోనైర్మల్యమును గురించి వర్ణించుచూ వాల్మీకి "ఆకాశ ఇవ నిర్మలః." 'ఆకాశమువలె విశాలమును, నిర్మలమునైన మనస్సు గలవాడు' అని వర్ణించెను. అతని భ్రాతృభక్తి అద్వితీయము. శ్రీరాముని పితృసమానునిగను, బంధువుగను, తన ప్రభువుగను భావించి, ప్రేమించి, గౌరవించి పూజించెడివాడు.

దశరథుడు మరణించిన ఎనిమిదవ రోజున భరత, శత్రుఘ్ను లిద్దరూ అయోధ్యానగరమునకు వస్తారు. వారికి తండ్రి మరణించిన

విషయం అయోధ్యలో అడుగుపెట్టినదాక తెలియదు. తల్లి కైకేయి ద్వారా అన్ని విషయములు సవిస్తరంగా తెలుసుకుంటారు. భరతునికి పట్టరాని కోపము, దుఃఖము ఒక్కసారి వస్తాయి. ఆవేశం అవధులు దాటుతుంది. మితిమీరిన కోపావేశంతో తల్లిని చూచి కఠిన స్వరంతో "ఈ రాజ్యం ఏలమని నాతో చెప్పడానికి నీకు నోరెలా వచ్చింది? నా తండ్రి ప్రాణాలు తీసి, నా రాముణ్ణి అడవులకు పంపి నన్ను రాజ్య మేల మంటావా? తరతరాలుగా వస్తున్న రాజవంశ మర్యాదను కాలదన్ని తమ్ముడికి పట్టం కట్టించాలన్న కోరిక నీ కెలా వచ్చిందో నాకు అర్థం కావడం లేదు. నీ యీ తుచ్ఛమైన కోరిక ఎన్నటికీ నెఱవేరదు. ఇంతటి మహాపాతకానికి వడిగట్టిన నీవా నా తల్లివి! ఇటువంటి మహా పాపితో మాట్లాడటం కూడా మహాపాపమే అవుతుంది. భర్తను బలిగొన్న హంతకురాలివి. సత్య ధర్మాలే మానవాకారంలో శ్రీరాముని రూపం దాల్చిన మా అన్నగారిని అడవులకు పంపిన రక్కసివి. నువ్వీ రాజ్యంలో వుండదగినదానివి కాదు. అగ్నియందు దుమికియో, కంఠమును ఉరిబోసుకొనియో, లేక దండకారణ్యాము లకు పోయియో మరణించుము. ధర్మాన్ని విడనాడి, దుర్మార్గాన్ని చేబట్టిన నీకు యిదే సరి అయిన శిక్ష" అని భరతుడు నిష్కర్షగా, నిర్మొగమాటంగా, కని పెంచిన తల్లియని కూడా ఆలోచించకుండా యిష్టంవచ్చినట్లుగా మాట్లాడుతాడు.

పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని మింగలేక మింగుతూ పెత్తల్లి కౌసల్యాదేవి వద్దకు వెళ్ళి శరణు వేడుకుంటూ భోరున ఏడుస్తాడు. కౌసల్య మొదట భరతుని కూడ అనుమానిస్తుంది. కైకేయి చేసిన ఈ కుట్రలో భరతుడు కూడ భాగస్వామియై వుంటాడని తలుస్తుంది. నిందావాక్యములతో భరతుని నిందిస్తుంది. అది సహజం కూడాను. ఏ పాపం ఎఱుగని భరతుని హృదయం బ్రద్ధలవుతుంది. ఇన్నాళ్ళూ ఎంతో ప్రేమగా చూచిన కౌసల్య

తనపై మోపిన నిందకు, నిష్కళంకుడైన భరతుని హృదయం కలచివేస్తుంది. కన్నతల్లి పన్నిన కుట్రకు ఫలితంగా రాజ్యాధికారం అనే గొప్ప లాభం పొందిన కుమారుడు తనకు ఏమీ తెలియదని నిరూపించుకోవడం కష్టమే అవుతుంది. యథార్థమే అయినప్పటికి సమాజం అంగీకరించదు. నిరపరాధినని మొరపెట్టుకున్నప్పటికి ప్రయోజనం వుండదు. కాలం కలసిరానప్పుడు అభాండాలు, అపవాదులు, అపనిందలు భరించి తీరవలసిందే. అమాయకుడైన భరతుడు ఈ మహాపాపంతో తన కెట్టి సంబంధంలేదని ఒట్టు పెట్టుకుంటాడు. శపథాలు చేస్తాడు. ప్రయోజనం శూన్యం. చివరికి చేయగలిగినది ఏమీలేక పసిపిల్లవాడిలా వెక్కి వెక్కి ఏడుస్తాడు.

చక్రవర్తికి చేయవలసిన ఉత్తరక్రియలన్ని సక్రమంగా నిర్వహిస్తారు భరత శత్రుఘ్నులు. దుఃఖంతో మునిగివున్న వారిని వశిష్ఠాది మహర్షులు ఓదారుస్తారు. కర్తవ్యాన్ని ప్రబోధిస్తారు. మహర్షులు, మంత్రులు, సామంతులు, పురప్రముఖులు అందరూ సమావేశమై ముక్తకంఠంతో భరతుని రాజ్యాధికారాలను స్వీకరించమని వేడుకుంటారు. పట్టాభిషేకమునకు అవసరమైన సకల మంగళ సంభారాలు సమకూర్చుతారు. భరతుడు మౌన ముద్రను వహిస్తాడు. మౌనం అంగీకార సూచకమని భావించి అక్కడ సమావేశమైన వారందరూ సంతోషిస్తారు. మరుక్షణంలో బడబాగ్ని బద్దలై ప్రశాంత వాతావరణం కల్లోలభరిత మౌతుందని ఎవరు ఊహించగలుగుతారు? భరతుడు తన పట్టాభిషేకంకోసం తెచ్చిన సంభారాలకు ప్రదక్షిణం చేస్తాడు. అక్కడ చేరిన వారందరూ ఆ సన్నివేశాన్ని చూస్తూ ఆనందోల్లాసాలతో కేరింతలు కొడుతుంటారు. మరుక్షణంలో కర్ణకఠోరమైన ఘోర వార్తను వినవలసి వస్తుందని ఎవరు భావించగలుగుతారు? అక్కడికి

విచ్చేసిన మహాజనులను చూచి భరతుడు చేతులు జోడించి వినయ పూర్వకంగా నమస్కరిస్తాడు. భరతుడు పట్టాభిషేకమునకు అంగీకరిస్తున్నాడని వారందరూ సంతోషిస్తారు. పిడుగులాంటి వార్తను వినవలసి వస్తుందని ఊహించడానికి కూడా ఏమాత్రం వారికి అవకాశం ఉండదు. అప్పుడు భరతుడు మౌనముద్రను విడనాడి గంభీర స్వరంతో "జ్యేష్ఠపుత్రుని హక్కు అయిన ఈ రాజ్యాన్ని నన్ను స్వీకరించమని కోరడం వంశాచారానికి విరుద్ధం. శ్రీరామచంద్రుడు నాకు జ్యేష్ఠుడు. ఆయనకు రావలసిన రాజ్యాన్ని అపహరించడం మహాపాతకం. నా తల్లి చేసిన పాప కృత్యమునకు నే నామోదింప జాలను. అరణ్యములకు వెళ్ళి ఆయనకు అక్కడే పట్టాభిషేకం గావించి సీతా రామ లక్ష్మణులను అయోధ్యకు తీసికొని రావాలని నేను నిశ్చయించుకున్నాను. ఒక వేళ శ్రీరామ చంద్రుని అయోధ్యకు తిరిగి తీసికొని రాలేకపోయిన యెడల నేను కూడా వారితో పాటు అడవులలోనే వుండిపోతాను. అందుకు కావలసిన యాత్రా సన్నాహములను చేయండి. నేను మాత్రం పట్టాభిషేకం చేసుకోను.ఇది నా వ్రతం, దృఢ నిశ్చయం" అని భరతుడు నిష్కర్షగా స్పష్టం చేస్తాడు.

రాకుమారుని ఆ మాటలను విని సభలోని వారందరూ ఆశ్చర్యచకితు లవుతారు. భరతునికి రాజ్యాధికారాన్ని కట్టబెట్ట డానికి సంసిద్ధమై కూర్చున్న ఆ పెద్దలందరూ భరతుని త్యాగ నిరతిని చూచి ఆనందపరవశు లవుతారు. భరతుని ధర్మనిష్ఠను ప్రశంసిస్తారు.

భరతుడు సపరివారంతో శ్రీరాముని సన్నిధికి చేరుకోవ డానికి సంసిద్ధమై బయలుదేరుతాడు. దారిలో నిషాధరాజగు గుహుణ్ణి కలుసుకుంటారు. భరతుడు తన తల్లులను గుహుడికి పరిచయం చేస్తూ "రాము డనే పెన్నిధిని బడిసిన ఈమె, పేరు కౌసల్యాదేవి. భరతు డనే నేను కుమారుడిగా పుట్టినందువల్ల

ఆ పెన్నిధిని పోగొట్టుకుంది ఈమె, పేరు కైకేయి. నేను పొంద లేని భాగ్యాన్ని లక్ష్మణుడు పొందాడు. అట్టి సోదరుని తల్లి ఈమె, పేరు సుమిత్రాదేవి " అని చెబుతాడు. తరువాత భరద్వాజాశ్రమం చేరుకుని, భరద్వాజ మహర్షికి రాణులతో ప్రదక్షిణం చేసి తన తల్లులను పరిచయం చేస్తూ "ఇదిగో దుఃఖంతో, ఉపవాస క్లేశంతో మిగిలి చిక్కి శల్యమై వున్న ఈమె, మహారాజు పట్టమహిషి కోసల్యాదేవి. ఇంద్రుణ్ణి కన్న అదితితో సమానురాలు ఈమె, శ్రీరాముని కన్నతల్లి. దుఃఖంతో కుమిలి, కృశించి, నీరసించి వాడిపోయిన తీగలాగా వున్న ఈమె. చక్రవర్తి రెండవ పట్టమహిషి- శ్రీరాముని వెంట నీడలా అనుసరించిన భాగ్యశాలి యగు నా అన్న లక్ష్మణుని కన్నతల్లి ఈమె, పేరు సుమిత్రాదేవి. ఈ దుఃఖాలకు, క్లేశాలకు అన్నింటికి కారణభూతురాలైన ఈమె, నా తల్లి - కైకేయి. ఆర్య రూపంలో వున్న అనార్య " అని వివరిస్తాడు. అడుగడుగునా తన తల్లిని సూటీ పోటీ మాటలతో ఎత్తిపొడుస్తుంటాడు. మానవాళి చిత్త సంస్కారం పొందడానికి ఒక్క భరతుని కథ చాలు. భరతుని ఆదర్శజీవిత చరిత్ర చదివిన వారు తప్పని సరిగా మానసిక పరివర్తన జెందుతారు. భరతుని లాంటి ఆదర్శజీవి, నిష్కల్మష నిర్మలహృదయుడు, ధర్మనిష్ఠాపరుడు, భ్రాతృభక్తిపరాయణుడు ప్రపంచ చరిత్రలో మరెక్కడా కనిపించడు. అటువంటి మహనీయుని కన్న అదృష్టం మన భరత మాతకే దక్కింది.

సపరివారంతో శ్రీరాముని సన్నిధికి భరతుడు చేరుతాడు. పచ్చికమీద కూర్చొని వున్న శ్రీరాముడు కనపడగానే పరుగులు పెడుతూ దగ్గరకు వెళ్ళుతాడు. దుఃఖం ఆపుకోలేక పోతాడు. కళ్ళనిండా నీరు క్రమ్ముతుంది. నోట మాట రాదు. ఎంతో ప్రయత్నంతో 'అన్నా!' అని మాత్రం అనగలుగుతాడు. శ్రీరాముని పాదాలమీద పడి వెక్కి వెక్కి ఏడుస్తాడు. దుఃఖంతో,

ఉపవాసాలతో కృశించి వన్నె తగ్గిన భరతుని లేవనెత్తి, కౌగిలించుకొని, ఒడిలో కూర్చుండ బెట్టుకొని, శిరస్సును నిమురుతూ "నాయనా! తండ్రిగారిని ఒంటరిగా విడిచిపెట్టి ఇంతదూరం ఈ అడవికి రావడం తగునా? ఎందు కలా చిక్కిపోయావు?" అని శ్రీరామచంద్రుడు ఎంతో ఆప్యాయతతో అడుగుతాడు. భరతునికి నోట మాటరాదు. ఏమి చెప్పాలో తోచదు. అయోమయ స్థితిలో పడిపోతాడు. పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ తండ్రి మరణవార్తను ఎలాగో చెప్పగలుగుతాడు.

ఆ ఘోర వార్త వినిన వెంటనే రాముడు గొడ్డలివేటుపడ్డ మ్రానులా కూలిపోతాడు. లక్ష్మణుడు విలపిస్తాడు. సీత కూడా శోకిస్తుంది. ఆ రాకుమారులు, సీత, సుమంత్రుడితో నదికి వెళ్ళి స్నానంచేసి, యథావిధిగా కర్మకాండలు పూర్తిచేసి పర్ణశాలకు తిరిగి చేరుకుంటారు. అయోధ్యానగరం నుంచి వచ్చిన ప్రజలందరు శ్రీరాముని చుట్టూ చేరుతారు. అప్పుడు భరతుడు ధైర్యం తెచ్చుకొని "అన్నా! నిన్ను అడవికి పంపిచితినిగదా యనే బాధతో కుమిలి కుమిలి నాయనగారు పరలోకానికి వెళ్ళిపోయారు. రాజు లేక రాజ్యం అనాథలాగా వుంది. రాజ్యభారము వహించవలసినవాడు జ్యేష్ఠుడు. నీకు సేవ చేయడం ఒకటే నా ధర్మం. నాతో అయోధ్యకు వచ్చి, పట్టం కట్టుకొని మన వంశ గౌరవ ప్రతిష్ఠలను యినుమడింప జేయుము. మన రాజ్య ప్రజల మనోభీష్టం కూడా అదే. మన్నింపుము" అని చెప్పి భరతుడు శ్రీరాముని రెండు పాదాలు పట్టుకొని ప్రాధేయపడుతాడు.

శ్రీరాముడు భరతుని లేవనెత్తి ఒళ్ళు నిమిరి "నాయనా! మనం సత్సంప్రదాయానికి చెందిన వంశీయులం. ఉత్తమ శిక్షణలో పెరిగినవారం. మనం ఎప్పుడూ తప్పులు చేయరాదు. తల్లిదండ్రులను గౌరవించడం కుమారుల కర్తవ్యం. మన తండ్రి నీకు రాజ్యభారం అప్పగించారు. నాకు వనవాసం యిచ్చారు.

మన ఇరువురి జీవిత విధానాలను నిర్ణయించి ఆయన శాశ్వతంగా కన్ను మూశారు. ఆయనమాట మనం జవదాటరాదు. ఆయన ఆజ్ఞను నెరవేర్చటం మన కర్తవ్యం, ధర్మం కూడాను" అని భరతునికి నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తాడు.

భరతుడు శ్రీరాముని మాటలకు సంతృప్తి చెందడు. శ్రీరాముడు అయోధ్యకు రావడానికి అంగీకరించడు. అప్పుడు భరతుడు సుమంత్రుణ్ణి పిలిచి "అన్న నన్ను కనికరించడంలేదు. దర్భలు తెప్పించి పరిపించు. నేను యిక్కడనే ఆమరణ నిరాహార వ్రతమును పూనుతాను" అని చెబుతాడు. సుమంత్రుడు కొంచెం జంకి శ్రీరాముని ముఖం చూస్తాడు. ఈ లోపున భరతుడే లేచి వెళ్ళి దర్భలు తెచ్చి పరచుకొని వాటిపైన పద్మాసనం వేసి కూర్చుంటాడు. క్షత్రియ ధర్మానికి విరుద్ధమైన పనిచేయడం తగదని భరతునికి నచ్చజెప్పి లేవదీస్తాడు. భరతుడు లేచి శ్రీరామునికి బదులుగా తనే వనవాసంచేసి తండ్రి ఆజ్ఞను అమలు పరుస్తానని, తనకు బదులు రాజ్యపాలన చేయమని శ్రీరాముణ్ణి వేడుకుంటాడు. శ్రీరాముడు ససేమిరా అంగీకరించడు. తండ్రి ఆదేశించిన విధముగా ఎవరిపని వారే చేయడం ధర్మంగాని, ఒకరి పని, మరొకరు చేయడం ధర్మ విరుద్ధమని, తండ్రి యాజ్ఞను తిరస్కరించడమే అవుతుందని నిష్కర్షగా శ్రీరాముడు స్పష్టం చేస్తాడు.

అప్పుడు వశిష్ఠుడు కలుగజేసుకొని ధర్మసూక్ష్మమును వివరిస్తాడు. "రాముని అధికార ముద్రతో ఆయనకు బదులు అనగా ఆయన ప్రతినిధిగా నీవు రాజ్యం చేయవచ్చు. అప్పుడు నింద వుండదు. సత్యరక్షణకూ లోటు రాదు. ధర్మ విరుద్ధం అంతకన్నా కాదు" అని వశిష్ఠుడు చెప్పిన మీదట భరతుడు తను పట్టిన పట్టును విడనాడి "నీ పాదుకలు నాకు యిమ్మా. నీకు బదులుగా వాటిని పూజిస్తూ, పదునాలుగు వత్సరాలు నగరం

బయటనే వుండి రాజ్యపాలన చేస్తాను. వనవాసానంతరం తక్షణమే తిరిగి అయోధ్యకు వచ్చి నీ రాజ్యమును నీవే స్వీకరించి పాలించు కోవాలి" అని భరతు వేడతాడు. శ్రీరాము డందుల కంగీకరించి తన పాదుకలను భరతునికి ఇస్తాడు. వాటిని శిరస్సున ధరించి, భరతుడు సపరివారంతో అయోధ్యకు తిరుగు ప్రయాణమవుతాడు. అయోధ్యలో మాత్రం అడుగు పెట్టడు. సమీపమునే వున్న నందిగ్రామంలో మకాం పెట్టి, శ్రీరాము డిచ్చిన పాదుకలను సింహాసనంపై వుంచి, ప్రజా సమక్షంలో వాటికి పట్టాభిషేకం గావించి "ఈ రాజ్యం శ్రీరాముడిది. దానిని ఆయన తాత్కాలికంగా నాకు ఒప్పజెప్పారు. నేను ఆయన ప్రతినిధిగా, ధర్మయుతంగా రాచకార్యాలను నిర్వహించుతానని హామీ యిస్తున్నాను" అని భరతుడు అందరి ముందర ప్రతిజ్ఞ చేస్తాడు.

సకల భోగ భాగ్యములను త్యజించి, నారబట్టలను ధరించి, కందమూలాదులను మాత్రమే భుజిస్తూ, కటిక నేలపై శయనిస్తూ, శ్రీరాముని ప్రతినిధిగా పదునాలుగు వత్సరాలు ప్రజానురంజకంగా భరతుడు పరిపాలన చేస్తాడు. వనవాసం పూర్తిచేసుకొని అయోధ్యకు తిరిగి వచ్చిన తక్షణమే శ్రీరామునికి పట్టాభిషేకం గావించి, రాజ్యాన్ని ఒప్పగించి తన బరువు తీరినట్లుగా సంతోషిస్తాడు.

ఇంతటి అద్భుత సన్నివేశం ప్రపంచ చరిత్రలో మరెక్కడా కనిపించదు. ఈ ప్రపంచమున రాజ్యకాంక్షతో ధర్మాధర్మము లను విచారించక, న్యాయాన్యాయములను గురించి యోచింపక తండ్రులను చంపి సింహాసన మధిష్ఠించిన పితృ హంతకులు ఎందరో వున్నారు. పదవీ వ్యామోహంతో అన్నదమ్ములను సహితం సర్వనాశన మొనర్చి రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్న భ్రాతృ హంతకులూ ఎందరో కలరు. అనేక అక్రమ అమానుష కృత్యాలను, దారుణ హింసాకాండలను, మారణ హోమాలను జరిపి చక్రవర్తులను సంహరించి సింహాసనాన్ని అధిష్ఠించిన మంత్రి

పర్యులు, సేనాధిపతులు కూడా కలరు. తన అధికారానికి ఎప్పుడో ఒకప్పుడు అడ్డు తగులుతారనే భయంతో, ప్రత్యర్థులను కారాగారాలకు పంపించినవారు, ఉరికంబాల కెక్కించిన పచ్చి స్వార్థపరులు కూడా ఎందరో వున్నారు.

కాని తనకు లభించిన రాజ్యాన్ని సహితం తృణప్రాయంగా నెంచి, తన యన్న కోసం వదలుకోవడానికి సంసిద్ధపడిన భరతుడు లాంటి నిస్వార్థపరులు మాత్రం ప్రపంచంలో ఎక్కడా కనిపించరు. తనకు సంక్రమించిన రాజ్యాధికారాన్ని సహితం విడనాడి, తన యన్న పాదాలపై బడి పదునాలుగు వత్సరాలు తానే వనవాసం చేస్తానని ప్రాధేయపడిన భరతుడు లాంటి త్యాగశీలురు ఏ వాఙ్మయమున మనకు కనుపించరు. తనకు రాజ్యాధికారాన్ని కట్టబెట్ట ప్రయత్నించిన తల్లిని సహితం అనరాని సూటిపోటీ మాటలతో చిత్రహింస చేసిన భరతుడు లాంటి ధర్మపరాయణులు కూడా మరెక్కడా కనుపించరు. సర్వాధికారములతో రాజ్యాధికారం సంప్రాప్తమైనప్పటికి స్వీకరింపక రామపాదుకలకు పట్టాభిషిక్తం గావించి రామ ప్రతినిధిగా పరిపాలన గావించిన భరతుడు లాంటి నిస్వార్థజీవిని మరెక్కడ చూడలేము. పదునాలుగు వత్సరాల తరువాత తిరిగివచ్చిన శ్రీరామచంద్రుడికి నవ్వుతూ, నవ్వుతూ రాజ్యాన్ని తిరిగి అప్పగించిన ఘనత భరతునికే దక్కింది.

ఒక్క పర్యాయం గద్దెకెక్కితే చాలు-ప్రజలు ఈసడించి నప్పటికి, తిరస్కరించి నప్పటికి, గద్దె దిగడానికి ఏమాత్రం ఇష్టపడని నేటిపాలకులు భరతుని ఆదర్శ పూరితమైన చరిత్రను ఒక్క పర్యాయం చదివి అవగాహన చేసుకొని మానసిక పరివర్తన జెందగలుగుతే చాలు దేశానికి ఎంతో మేలు చేసిన వారవుతారు. అధికారాన్ని సంపాదించడాని కోసం, వచ్చిన అధికారాన్ని నిలబెట్టుకోవడానికోసం చేయరాని పనులు చేస్తూ అనేక అక్రమ అకృత్యాలకు పడిగడతున్న నేటి స్వార్థపరులు భరతుని త్యాగ

మయమైన చరిత్రను చూచి సిగ్గుపడాలి. దేశం బాగుపడాలంటే, ధర్మం నాలుగుపాదాల విలసిల్లాలంటే, సుఖశాంతులతో సుభిక్షంగా మనగలగాలంటే శ్రీరామ చరిత్రను చదవాలి, శ్రీరామ సోదరులను ఆదర్శంగా గైకొనాలి. వారి త్యాగబుద్ధిని అలవరచుకోవాలి. అప్పుడే ఈ దేశం బాగుపడుతుంది.

"సత్యమే పరమ ధర్మము. సత్యమే ఈ లోకములో ఈశ్వరుడు. సత్యమే స్వర్గానికి మూలము సత్యాన్నే లక్ష్మి ఎప్పుడూ ఆశ్రయించుకొని ఉంటుంది. సత్యమే సమస్తానికీ ఆధారము. సత్యముకన్నా అధికమయిన ధర్మము ఏదీలేదు. మనము చేసే దానాలూ, హోమాలు, తపస్సులూ సత్యము మీదనే ఆధారపడి వున్నవి. అందువల్ల ప్రతివాడూ సత్యవ్రతుడుగా ఉండవలెను.

శ్రీ శ్రీనివాస శిరోమణి రామాయణం నుండి

"నైవాహం రాజ్య మిచ్ఛామి న సుఖం న చ మైథిలీమ్
నైవ సర్వా నిమాన్కామాన్న స్వర్గం నైవ జీవితమ్.
త్వా మహం సత్య మిచ్ఛామి నాఽనృతం పురుషర్షభ
ప్రత్యక్షం తవ సత్యేన సుకృతేన చ తేశపే"

"ఓ తండ్రీ! నాకు రాజ్యముపైనగాని, రాజ్యసుఖములపైనగాని యెట్టి లోభములేదు. నాకు రాజ్యము కంటెను, రాజ్యభోగముల కంటెను, నా యర్ధాంగియగు మైథిలి ( సీత ) కంటెను, స్వర్గాది పుణ్యలోకము కంటెను, నా జీవితముకంటె గూడ సత్యమును పాలించుటే నాకు మిక్కిలి యభీష్టము. నేను కోరుకొనేది ఒకటే అది నీవు సత్యమును పాలించుట, అనృతమాడకుండుట నాకు ప్రత్యక్ష దైవతమగు నీ యెదుట సత్యముపైనను, సుకృతముపైనను, శపథముచేసి చెప్పుచున్నాను.

— శ్రీరామచంద్రుడు

6

# హనుమంతుడు

శ్రీరామాయణ మహాకావ్యము నుండి హనుమంతుని పాత్రను మినహాయిస్తే అసలు కథే లేదేమో ననిపిస్తుంది. ఉప్పు లేని పప్పుకూర ఏ విధముగా రుచింపదో, హనుమంతుడు లేని రామాయణం స్థితి కూడా అంతే. ఈ కావ్యంలో హనుమంతుడు ప్రధాన నాయకుడు కాకపోయినప్పటికీ, లంకా విజయం హనుమంతుడు లేకుండా సాధ్యపడేది కాదేమో ననిపిస్తుంది.

ఈయన శ్రీరామచంద్రునికి ఆత్మార్పణం గావించుకొనిన పరమభక్తాగ్రేసరుడు. హనుమంతుడు సర్వశక్తిసంపన్నుడు. మహావీర, విక్రమ బలపరాక్రమ సంపన్నుడు. సకలశాస్త్ర కోవిదుడు. ఉత్తమ భృత్యుడు, ప్రభుభక్తి పరాయణుడు, దౌత్యమును నెఱపడంలో అతనికి అతనే సాటి.

దుష్టులను శిక్షించుట కొఱకు, శిష్టులను రక్షించుట కొఱకు, రామకార్య సిద్ధి కొఱకును శివుడే హనుమంతుడుగా అవతరించి యున్నాడని పురాణములు ఘోషిస్తున్నాయి. సీతాన్వేషణ కొఱకు హనుమంతుడు చేసిన సాహస కృత్యములు సామాన్య మానవుడు గాని, వానరుడు గాని చేయలేడనే విషయం జగద్విదితము. అతడు దైవాంశ సంభూతుడు కావడం వల్లనే శ్రీరాముని కార్యమును విజయవంతంగా నిర్వహించగలిగాడు. అతి దుష్కరము లైన కార్యములను నిర్వహించినందుకు, యుద్ధభూమిలో అతడు ప్రదర్శించిన అత్యద్భుత వీరకృత్యములకు శ్రీరామచంద్రుడు

8)

సహితం ఆనందపరవశుడై "అతని బాహుబలము వలననే నేను లంకను జయించితిని. సీతను తిరిగి పొందగలిగితిని. లక్ష్మణుడు తిరిగి దక్కినాడు. విజయము లభించినది. రాజ్యము లభించినది. బంధు మిత్రాదులను తిరిగి కలుసుకొనగలిగితిని" అని హనుమంతుని ప్రశంసిస్తాడు.

అతనిలో ఉత్తమ దాత్య లక్షణాలు ఎన్నో వున్నాయి. బాహుబలంతో పాటు బుద్ధిబలం కూడా వున్నది. దేశ కాలమాన పరిస్థితులను బట్టి అతి మెళుకువగా, సమయోచితంగా సమయ స్ఫూర్తితో సంచరించ గల చాతుర్యం కూడా అతనిలో వున్నది.

సీతను వెదకుటకు వానరసేనను సుగ్రీవుడు అన్ని దిక్కులా పంపిస్తాడు. వెదకుతూ, వెదకుతూ హనుమంతుడు వంద యోజనములు గల సముద్రమును దాటి లంకాపురి చేరుకుంటాడు, అతి కష్టం మీద సీతను అశోకవనంలో కనుగొంటాడు. లంకాపురి రాక్షసులకు తన శక్తిని కొంచెం చవి చూపించుతాడు. అడ్డు వచ్చిన రాక్షసులను యమపురికి పంపించుతాడు. హనుమంతుని ధాటికి ప్రహస్తుడి కుమారుడైన జంబుమాలి శరీరం నుగ్గు నుగ్గయి పోతుంది. అక్షయుడు అస్తమిస్తాడు. ఐదుగురు సేనాధిపతులు, ఏడుగురు మంత్రి కుమారులు హనుమంతుని చేతిలో వధించబడుతారు. అక్షయుడు మరణించాడనే వార్తను వినగానే రావణుడు కంపించిపోతాడు. ఇంద్రునితో సమానుడైన ఇంద్రజిత్తును పిలిచి "బ్రహ్మాస్త్రాన్ని పొందిన నీవు తప్ప, ఈ కోతిని ఎదిరించగల శక్తిసామర్థ్యములు గల వారెవ్వరూ నాకు కనిపించడం లేదు. వీడితో బాహాబాహీ యుద్ధము పనికిరాదు. ఏమి చేయాలో బాగా ఆలోచించి, నువ్వు ఇతన్ని ఎదిరించి విజయంతో తిరిగిరా" అని రావణుడు ఆజ్ఞాపిస్తాడు.

అప్పుడు ఇంద్రజిత్తు తన శక్తిని సమకూర్చుకొని బయలుదేరుతాడు. హనుమంతునితో హోరాహోరీగా యుద్ధం జరుగుతోంది.

హనుమంతుడు ఆకాశాని కెగిరి, మెరుపుల్లాగా వస్తున్న బాణాల నుంచి అద్భుత వేగంతో, చిత్ర విచిత్ర గతులతో తిరుగాడుతూ తప్పించుకుంటుంటాడు. ఎన్ని బాణాలు అతనిపై ప్రయోగించినా హనుమంతుని శక్తి ఏమాత్రం తగ్గడంలేదు. ఏమి చేయాలో తోచక ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. బ్రహ్మాస్త్ర మహిమ తెలిసిన హనుమంతుడు ఒక్క ముహూర్త కాలము క్రిందపడి వుంటాడు. రాక్షసులందరూ చుట్టూ మూగి తాళ్ళతో, మోకులతో హనుమంతుణ్ణి బంధిస్తారు. ఆ విధముగా తాళ్ళతో బంధించడంవల్ల బ్రహ్మాస్త్ర శక్తి పోనే పోతుంది. రాక్షసులు మూఢులై, అమాయకత్వంతో చేసిన యీ పనికి ఇంద్రజిత్తు ఎంతగానో చింతిస్తాడు. తాను ప్రయోగించిన శక్తి నిష్ప్రయోజనమై పోయిందని బాధపడతాడు.

బ్రహ్మాస్త్ర మహిమ తొలగిపోయిందని హనుమంతునికి కూడ తెలుస్తుంది. ఆ భౌతిక బంధనాలను ఒక్క క్షణంలో తెంపివేయగల శక్తి హనుమంతునిలో వున్నది. అయినప్పటికి ఆవిధముగా చేయడు. ఈవిధముగా నయినా సరే రావణుని చూసి మాట్లాడే అవకాశం లభిస్తున్నందులకు లోలోన సంతోషిస్తాడు. రాక్షసులు అతనిని ఈడ్చుకొని పోయి కొలువుకూటంలో రావణుని ఎదుట నిలబెడుతారు. రాజాజ్ఞ ప్రకారం మంత్రి ప్రహస్తుడు లేచి హనుమంతుని రాకకు కారణం, పూర్వాపరాలు ప్రశ్నిస్తాడు. అప్పుడు హనుమంతుడు ఎంతో ధైర్యంతో "నేను సుగ్రీవుని దూతను. నా ప్రభువైన సుగ్రీవుడు రామ లక్ష్మణులతో సఖ్యం చేసుకొనినాడు. అతిబలాఢ్యుడైన వాలిని ఒక్క వేటుతో శ్రీరామచంద్రుడు సంహరించి, సుగ్రీవుని కోరికను నెరవేర్చినాడు. కృతజ్ఞతతో సుగ్రీవుడు తన వానరసేనను సీతాదేవి జాడను తెలుసుకొనుటకు భూలోకమంతా వెదకమని పంపించినాడు. ఆ సందర్భమున నేను వేయి యోజనాల సముద్రమును లంఘించి

లంకలో అడుగుపెట్టాను. భర్తకోసం నిరీక్షిస్తున్న సీతను అశోక వనంలో చూచాను. అటువంటి పతివ్రతా శిరోమణి అయిన సీతాదేవిని అపహరించడం ధర్మవిరుద్ధం. ఇది తమ కులనాశనానికి దారి తీస్తుంది. పరాయి స్త్రీని కోరడం మహాపాపం. తాము సంపాదించుకున్న వరాలన్నీ రఘువీరుని ముందర ఏమాత్రం పనికి రాకుండా పోతాయి. ఏ శక్తి తమర్ని రక్షించలేదు. సర్వ శక్తివంతుడైన శ్రీరామునితో వైరం అంత మంచిదికాదు. అది మీ వంశ సర్వనాశనానికి దారితీస్తుంది. వానరరాజు దూతనైన నా పలుకులను ఆలకించి పతివ్రతా శిరోమణి అయిన సీతను శ్రీరామునికి ఒప్పగించి మీ లంకాపురిని, మీ పరివారాన్ని, మీ బంధుమిత్రులను రక్షించుకోనండి" అని స్పష్టమైన మాటలతో, బందీ నయినాననే భయం కూడా లేకుండా ఎంతో హుందాతనంగా హనుమంతుడు గంభీరస్వరంతో చెబుతాడు.

హనుమంతుని మాటలు వినిన లంకేశ్వరుడు కోపోద్రిక్తుడై రోషావేశంతో "ముందు ఈ కోతిని చంపి, తరువాత మరొక పని చూడండి" అని రాక్షస సేనకు ఆజ్ఞాపిస్తాడు. సభలోనున్న విభీషణుడు లేచి "దూతను చంపడం రాజనీతికి వ్యతిరేకమని చెబుతాడు. ఒకవేళ విదేశీ దూత మన రాజ్య రక్షణకు భంగం కలిగే పనులు చేసినాడని ఋజువు అయిన యెడల, అట్టి దూతను వికలాంగుని చేయడం గాని, కొరడాలతో కొట్టడంగాని, వాతలు వేయడం గాని చేయవచ్చునుగాని మరణదండన విధించడం ధర్మం కాదని వాదిస్తాడు. ఇతణ్ణి చంపివేస్తే శత్రువులు యిక్కడికి వచ్చే అవకాశమే పోతుందని చెబుతాడు. ప్రాణాలతో వదిలి పెడితే శత్రువులు మనల్ని ముట్టడించ ప్రయత్నిస్తారని, అప్పుడు మన బలం వారికి చవి చూపించి తగిన శిక్ష విధించ వచ్చు" నని విభీషణుడు చెబుతాడు. రావణుడు విభీషణుని ఆలోచనలతో ఏకీభవించి "ఆ కోతి తోకకు నిప్పు ముట్టించి తరిమి వేయండి" అని ఆజ్ఞాపిస్తాడు.

అప్పుడు హనుమంతుడు మనస్సులో సంతోషిస్తాడు. రావణుని అజ్ఞానానికి విచారిస్తాడు. రాక్షసులందరూ చూట్టూ చేరి తోకకు గుడ్డలు చుడుతారు. నూనె పోసి నిప్పు అంటించుతారు. హనుమంతుడు తన శరీరాన్ని ముడుచుకొని, ఒకేసారి పెద్దదిగా చేసి విదిలిస్తాడు. కట్టిన కట్లన్నీ పటాపంచలవుతాయి. విశ్వరూపందాల్చి మండుతున్న తోకతో పైకి ఎగిరి ఒక పెద భవనం మీద నిలుచుంటాడు. ఒక పెద్ద ఉక్కు స్తంభాన్ని పెకలించి, అందరూ చూస్తుండగా గిరగిర త్రిప్పి నేలకు వేసి కొడతాడు. అది ముక్కముక్కలై చెల్లాచెద రవుతుంది. ఒక ఇంటి మీద నుంచి మరొక ఇంటి మీదికి దుముకుతూ నిప్పు పెడుతూ స్వైరవిహారం చేస్తాడు. ఒక్క క్షణంలో లంకా నగర మంతా అగ్నిజ్వాలలు అలముకుంటాయి. ఆకాశం ఎత్తున మంటలు లేస్తాయి. ఈ సన్నివేశాన్ని చూచి పెద్దలు, పిల్లలు హాహాకారాలు చేస్తారు. హనుమంతునికి ఇంతలో సీత గుర్తుకు వస్తుంది. సీత కూడా అగ్నికి ఆహుతి అయిపోయిందేమోనని బాధపడుతాడు. తాను ఆవేశంలో తొందరపడి చేసిన పనికి చింతిస్తాడు. అశోక వనమునకు పరుగెత్తుతాడు. సీతాదేవి శింశుప వృక్షం క్రింద సురక్షితంగా కూర్చొని వుంటుంది. అప్పుడు అతని ఆనందానికి అంతే వుండదు.

సీతాదేవికి నమస్కరిస్తాడు. ధైర్యాన్ని చెప్పి ఊరడిస్తాడు అనతికాలంలోనే సుగ్రీవుడు కోట్లాది వానర సేనతో, వీరులైన రామ లక్ష్మణులతో కలసివచ్చి, రావణుని, అతని పరివారాన్ని హతమార్చి, అయోధ్యకు తిరిగి తీసుకొని వెళ్లుతాడని ధైర్యం చెబుతాడు. హనుమంతుడు ఆమె అనుజ్ఞను పొంది తిరిగి ప్రయాణ మవుతాడు.

హనుమంతుడు సమయస్ఫూర్తితో ప్రదర్శించిన బలపరాక్ర మాదులు, రావణునితో సంభాషించునపుడు ఆతడు అనుసరించిన

నీతికోవిదత్వము, దూతగా నిర్భయంగా, సమయోచితంగా అతడు నిర్వహించిన కుశలత్వము, నిరాశ నిస్పృహలతో కుమిలి కృశించి చిక్కి శల్యమై జీవచ్ఛవంలా వున్న సీతకు ఆత్మవిశ్వాసాన్ని కలుగ చేయడానికి చాకచక్యంతో కూడిన అతని ప్రయత్నం, అతని ఓర్పు, మానసిక ధృతి, ఆత్మస్థైర్యము, త్రోవలో అతని కెదురైన విఘ్నములను కలుగజేయ ప్రయత్నించిన సురస, సింహికలను చంపుటలో అతను ప్రదర్శించిన ప్రజ్ఞాపాటవములు అసమానములు.

హనుమంతుడి వంటి బల బుద్ధి పరాక్రమ సంపన్నుడు, ప్రభుభక్తి పరాయణుడు, దౌత్య కార్యములను విజయవంతంగా నిర్వహించగల సమర్థుడు, కార్యదీక్ష గల దూత శ్రీరామునికి లభించని యెడల అంతా తారుమారై వుండేది. తనకు అప్పగించిన రాచకార్యమును విజయవంతంగా నిర్వహించడంలో అడుగడుగునా అతను ప్రదర్శించిన సమయోచిత కార్యనిర్వహణ దక్షత దీర్ఘ దర్శిత్వము, జాగరూకత, పట్టుదల, మనోనిగ్రహము ఈనాటి రాజకీయవేత్తలకు, పరిపాలకులకు, రాయబారులకు అత్యంత ఆదర్శప్రాయములు.

సీతాదేవి వద్ద సెలవు తీసుకొని సముద్రమును దాటుచున్న హనుమంతునికి విశ్రాంతి చేకూర్చదలచిన మైనాకునితో "నేను ఆగుట లేదని కోపగింపకుము. నీ ఆతిథ్యమును స్వీకరించలేక పోతున్నందుకు అన్యథా భావింపకుము. ప్రొద్దుగుంకుతున్నది. నాపై గల రాజ్యభారమును బట్టి నే నాగుటకు వీలులేదు" అని చెప్పి చేతితో అతనిని స్పృశించి, పైకి ఎగిరి తన మార్గమున తాను శీఘ్రముగా పోతాడు. ఈ సంఘటనను బట్టి హనుమంతునిలో గల కర్తవ్యపరాయణత్వము, కార్యదీక్ష, పట్టుదల ఎంతటి దృఢమైనవో మనము అర్థము చేసుకోవచ్చును. రాచకార్యము లను నిర్వహించువారు అప్రధానములగు కార్యములచేత ఆకర్షింప బడకుండా, అసలు కార్యాలను సకాలంలో నిర్వహించి నప్పుడే

కార్యాలు సాఫల్య మవుతాయని హనుమంతుడు ఋజువు చేసి ప్రపంచానికి చాటాడు. నేటి రాయబారులు, దూతలు హనుమంతుని ఆదర్శంగా గైకొనడంవల్ల మాతృదేశానికి మంచిని చేకూర్చిన వారవుతారు. రాచకార్యార్థం నియమింపబడినవారు కర్తవ్య పరాయణులుగను, దూరదృష్టిగలవారుగను ఉండటం ముఖ్యమని హనుమంతుడు పాటించి, చేసి చూపించాడు.

అసలు సముద్రాన్ని దాటి లంకకు చేరాలని సంకల్పించుకున్నప్పుడే హనుమంతుడు ఒక దృఢ నిశ్చయానికి వస్తాడు. తన మనోనిశ్చయాన్ని ప్రారంభంలోనే ప్రకటిస్తాడు. "శ్రీరాముని బాణము వేగమువలె లంకకు పోవుదును. అక్కడ సీత కనపడని యెడల స్వర్గమునకు పోవుదును. అక్కడా కనపడని యెడల తిరిగి లంకాపురికి వచ్చి రావణునితో సహా లంకాపురిని పెకలించి తీసుకొని వచ్చి శ్రీరాముని ముందు ఉంచుతాను." హనుమంతుడు తన దృఢ సంకల్పాన్ని ముందుగానే వెలిబుచ్చుతాడు. అతని మాటలను బట్టే అతనిలో గల పట్టుదల, అచంచలమైన ఆత్మ విశ్వాసం ద్యోతక మవుతున్నది. అంతే కాదు. శ్రీరాముని యెడల అతనికి గల భక్తి విశ్వాసాలు తేటతెల్ల మవుతున్నాయి.

లక్ష్మణుడు యుద్ధభూమిలో మూర్ఛిల్లినప్పుడు సంజీవిని తీసుకొని వచ్చి లక్ష్మణుని బ్రతికింప సంకల్పించుకుంటాడు. రివ్వుమని ఆకాశానికి ఎగిరిపోతాడు. ఆకాశమార్గాన సంజీవి పర్వతానికి చేరుకుంటాడు. అయితే ఆ కొండమీదనున్న సంజీవి చెట్టును గుర్తించలేకపోతాడు. దానిని సకాలంలో తీసుకొని వెళ్ళకపోతే లక్ష్మణుడు మరణిస్తాడు. ఆ దుఃఖముతో రాముడు కూడా ప్రాణత్యాగం చేస్తే చేయవచ్చును. రిక్త హస్తాలతో తిరిగి వెళ్ళదలచ లేదు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి ఆ సంజీవిపర్వతాన్నే పెకలించి, చేత బూని వాయువేగంతో లంకకు చేరుతాడు. ఈ సంఘటనను బట్టి హనుమంతుని దృఢ సంకల్పం ఎట్టిదో మనం బాగా అర్థం

చేసుకోవచ్చును. ప్రస్తుత సమాజంలో అటువంటి దృఢ సంకల్పాలు, కర్తవ్యనిష్ఠల కొరత వుండటం వల్లనే రాచకార్యాలు దెబ్బతింటున్నాయి.

లంకా యుద్ధమునందు హనుమంతుడు ప్రదర్శించిన బల పరాక్రమాదులను గురించి వర్ణించ శక్యము కాదు. ధూమ్రాక్షి, అకంపన, దేవాంతక, నికుంభాది పెక్కు రాక్షస వీరులను వధిస్తాడు. అతని పరాక్రమమును చూచి నివ్వెరపోయి, త్రిలోక విజేత యగు రావణాసురుడే స్వయంగా ప్రశంసిస్తూ "సాధు వానర వీర్యేణ శ్లాఘ నీయోఽసిమేరిపుః." 'ఓ వానరా! శభాష్. నీవు శ్లాఘము నందుకొనుటకు తగిన 'శత్రుడవు' అని అంటాడు. హనుమంతుని వీరోచిత చర్యలను చూచి రావణుని ధైర్యం సన్నగిలుతుంది. తన శక్తియందే తనకు అనుమానం ఏర్పడుతుంది. అప్పుడు ఇంద్రజిత్తును పిలిచి హనుమంతుని బలపరాక్రమాదులను గురించి ఎఱుకపరుస్తూ "హనుమంతుడు సాధారణ బలసంపన్నుడు కాదు. అతని ముందు మన సేనలు నిష్ప్రయోజనముగ కన్పించు చున్నాయి. వజ్రాయుధము వంటి ఆయుధములు సైతం అతనిని ఏమీ చేయజాల కున్నాయి. అతని గతి మారుతిని గతిని, అతని శక్తి అగ్నిహోత్రుని అతిక్రమించినది" అని అంటాడు.

హనుమంతుని అద్భుత సాహస కృత్యాలను గురించి శ్రీరాముడే స్వయముగా ప్రశంసిస్తాడు. యుద్ధభూమిలో అతడు చాకచక్యంగా సమయస్ఫూర్తితో నిర్వహించిన తీరును శ్రీరాముడు అభినందిస్తూ "ఇటువంటి మహత్తర కార్యాలను నిర్వహించగల సమర్థులు, ఈ భూమండలములో హనుమంతునిలాగే మరెవ్వరూ నిర్వహించలేరు. ఇతడు చేసిన సాహసకృత్యాలవల్ల మొత్తం రఘు వంశమే విపత్తుకు గురికాకుండా రక్షింపబడినది" అని కొనియాడుతాడు.

హనుమంతుని శక్తి సామర్థ్యములు రావణుని సహితం మంత్రముగ్ధునిగా చేసాయి. అటువంటి సాహసవీరుడు శ్రీరామునికి లభించని యెడల లంకా విజయం అంత తేలికగా చేకూరేది కాదేమో!

హనుమంతుని దౌత్య నీతిని ప్రతి ఒక్కరూ చదివి అవగాహన చేసుకోవడం మంచిది. ముఖ్యముగా విదేశములలో ఉండు రాయబారులు, విదేశాంగ మంత్రులు, ప్రత్యేక దూతలు హనుమంతుని పాత్రను చక్కగా అవగాహన చేసుకొనిన యెడల, విదేశాలతో విజయవంతంగా దౌత్య సంబంధాలను నెలకొల్ప గలుగుతారు. దేశం యొక్క కీర్తి ప్రతిష్ఠలను యినుమడింప జేయ గలుగుతారు.

**"భారతీయులు ఆశావాదులు. వారు నిరాశకు హృదయమున తావీయరు. నిరాశకు మనస్సులో తావిచ్చినచో నతడు తన సర్వశక్తులను కోల్పోయి, యెట్టి కార్యమును చేయజాలక, తన జీవితమును తానే నాశనమొనరించు కొనును. అప్పుడు మానవ జీవితమే వ్యర్థమగును. ఉత్సాహము, ఆశ మొదలగునవి మానవుని అభ్యుదయకరములగు కార్యముల యందు ప్రవర్తిల్ల జేయును. ఉత్సాహవంతున కసాధ్యమేదియును లేదు."**

**—డా. మల్లాది గోపాలకృష్ణశర్మగారి రామాయణ వైభవము నుండి**

**"కోపమువల్ల బుద్ధి మందగిస్తుంది. కోపానికి వశులమైపోతే, యథార్థాన్ని చూడగల శక్తిని కోల్పోతాం. దానివల్ల వినాశనం పొందుతాం"**

**—రాజాజీ రామాయణం నుండి**

**"పౌరులు వారి అంతట వారు తెచ్చుకున్న కష్టాలను రాజులు తొలగించవలెను. కాని రాజులు తమ కష్టాలను పౌరులు అనుభవించేటట్లు చేయకూడదు."**

**—శ్రీ శ్రీనివాస శిరోమణి రామాయణం నుండి**

# 7

## సుమిత్రా దేవి

ఈ మహాకావ్యంలోని ఆదర్శవంతమైన సుమిత్ర పాత్రను ప్రస్తావించకుండా ముగించడం ఏమాత్రం న్యాయంకాదు. సుమిత్ర పాత్ర రామాయణంలో బహు తక్కువగా కనిపిస్తుంది. అయినప్పటికి అత్యంత ఆదర్శవంతమైనది. ప్రతి స్త్రీ ఆ పాత్రను సక్రమంగా అర్థంచేసుకోవాలి. ప్రతి తల్లి ఆమెను అనుసరించాలి. ఆమెలోని ఔదార్యమును దేశభక్తిని అలవరచుకోవాలి.

సుమిత్ర మితభాషి, మహాజ్ఞాని కూడాను. ప్రతి చిన్న విషయాన్ని సంపూర్ణజ్ఞానంతో తెలుసుకొని నడచుకొనేది, పతి భక్తి పరాయణురాలు, సేవా తత్పరురాలు, ధర్మ సూక్ష్మమును తెలుసుకొనిన ఆదర్శ మాతృమూర్తి. ఎంతటి కష్టములనైన స్థైర్యంతో ఎదుర్కొన గల శక్తి ఆమెలో వున్నది. అందరు స్త్రీలలా కష్టము లెదురైనప్పుడు ఏడుస్తూ కూర్చునేది కాదు. సీతా రామ లక్ష్మణులు వనవాసానికి పోవ సంకల్పించుకున్నప్పుడు, కౌసల్యాదేవిలాగ సుమిత్ర అడ్డు చెప్పలేదు, విలపించనూలేదు, పై పెచ్చు లక్ష్మణునికి బుద్ధులు గరిపి, ధైర్యం చెప్పి సాగనంపింది.

వనవాసానికి బయలుదేరేటప్పుడు లక్ష్మణుడు తల్లికి పాదాభివందనం చేసి దీవించమని కోరుతాడు. అప్పుడు సుమిత్ర అతనిని దగ్గరికి తీసుకొని శిరస్సును నిమురుతూ "నాయనా! నీలాంటి భ్రాతృభక్తి గల వీరుని కనడం నిజంగా నా అదృష్టం. రాముడి రక్షణ కర్తవ్యం నీ కర్తవ్యం. అడవిలో సదా నీ అన్నకు తోడుగా నిలచి, అతి మెళకువతో వ్యవహరించాలి. అదే

నీ ధర్మం '' అని ప్రబోధిస్తుంది. స్త్రీ జాతిలో అంతటి విశాల స్వరూపులు అరుదుగా కన్పిస్తారు.

రఘువంశ మర్యాదను, ధర్మ ఔన్నత్యాన్ని గురించి వివరిస్తూ

**" రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్**
**అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత ! యథా సుఖమ్. "**

'' నాయనా ! అరణ్యములో శ్రీరాముని తండ్రియగు దశరథునిగాను, సీతను తల్లి యగు నన్నుగాను, అడవిని అయోధ్యగాను భావించి మసలుకొమ్ము '' అని సుమిత్రాదేవి లక్ష్మణునికి ధర్మనిష్ఠను ప్రబోధించి, ఆశీర్వదించి పంపిస్తుంది. ఆమె ధర్మ పరాయణత్వం, ఉదారత్వం, ధీరత్వం ప్రశంసనీయాలు. తన సవితి కొడుకు వెంట కష్టాలు పడటానికి తన స్వంత కొడుకును ప్రోత్సహించి అడవులకు పంపించిన తల్లి మనకు ఏ చరిత్రలోనూ కనిపించదు. అందులో ఒకరోజు కాదు, నెల కాదు, పదునాలుగు వత్సరాలు భార్యకు, తల్లికి దూరమై, సకల రాజభోగాలను త్యజించి అడవులపాలై, కందమూలాదులను తింటూ, అష్టకష్టాలు పడటానికి అంగీకరించిన సుమిత్ర లాంటి తల్లి ఈ భూప్రపంచంలో మరెక్కడా కనిపించదు. ఇది ఒక విచిత్ర సన్నివేశం. ఒక వైపు తండ్రి యాజ్ఞను శిరసావహించడానికి అడవులకు పయనమై పోతున్న శ్రీరాముని అడవులకు వెళ్ళవద్దని బ్రతిమాలుకుంటూ శోకిస్తున్న తల్లి కౌసల్యాదేవి, మరొకవైపు అడవులకు వెళ్ళవలసిన బాధ్యత లక్ష్మణునిమీద లేకపోయినప్పటికీ, శ్రీరాముని అనుసరించి అడవులకు వెళ్ళడం ధర్మమని ప్రబోధించి, ప్రోత్సహించి పంపిస్తున్న తల్లి సుమిత్రాదేవి. ఇటువంటి విచిత్రమైన సంఘటన మనకు ఏ చరిత్రలోను, ఏ వాఙ్మయమున కనిపించదు.

శ్రీరామచంద్రుడు అడవులకు పోయినందులకు విలపించుచున్న కౌసల్యకు ధైర్యాన్ని చెబుతుంది. ఓదారుస్తుంది. కర్తవ్యాన్ని ప్రబోధిస్తుంది. విచారించవద్దని చెబుతూ '' రాఘవుని వంటి

పురుషోత్తముని, పుత్రునిగా పొంది నీవు ఈ విధముగా శోకించడం సముచితం కాదు. శస్త్రాస్త్ర సంపన్నుడు, శూరుడు నగు నీ పుత్రుడు గృహమున నున్నట్లే, అరణ్యమున గూడ సుఖముగా నుండగలడు. పవిత్ర హృదయము గల ధీరుడు లక్ష్మణుడు, పరమసాధ్వియగు సీత కూడా అతని వెంట నుండగా అతనితో యుద్ధంచేసి ఎవ్వడునూ బ్రతికి బయటపడ జాలడు'' అని సుమిత్ర ఎంతో విశ్వాసంతో సీతా రామ లక్ష్మణులను గురించి చెప్పి, భయపడవద్దని కౌసల్యను ఉత్సాహపరుప ప్రయత్నిస్తుంది.

రామ లక్ష్మణుల శక్తిని అంచనా వేయగల సమర్థత సుమిత్రకు వున్నట్లుగా ఆమె మాటలవల్ల మనం అర్థంచేసుకొన వచ్చును. ధైర్యంతోపాటు సుమిత్రకు దూరదృష్టి కూడా కలదనే విషయం స్పష్టమౌతున్నది. ఆత్మవిశ్వాసంతోపాటు ఆత్మ నిగ్రహం కూడా ఆమెకు కలదు. ధైర్యంతోపాటు ధర్మనిష్ఠ కూడా వున్నది.

శ్రీరాముడంటే సుమిత్రకు అమితమైన ప్రేమ. తన స్వంత కుమారునివలె చూచుకొనేది కావడం వల్లనే, శ్రీరామునికి వచ్చిన కష్టం తనదిగా భావించగలిగింది. అతని కష్టంలో లక్ష్మణునికూడా పాలుపంచుకునేట్లుగా చేయగల్గింది.

సుమిత్రలాంటి తల్లులు అందరూ అయితే లక్ష్మణుడులాంటి సోదరులు ఉద్భవిస్తారు. శ్రీరామునిలాంటి అన్నలను అనుసరిస్తారు. దేశ భవిష్యత్తును తీర్చిదిద్ద గలుగుతారు.

"ఎవరితోను అయినా సరే అతిగా స్నేహం చేయరాదు. అసలు స్నేహమే చేయకుండా బిగతీసుకొని కూర్చోరాదు. రెండూ గొప్ప తప్పులే. ఒతి ఎప్పుడూ పనికిరాదు. మధ్యస్థముగా నుండవలెను."

— శ్రీ శ్రీనివాస శిరోమణి రామాయణం నుండి

# రామాయణ సందేశం

రామాయణ మహాకావ్యంలోని పాత్రలన్నీ ప్రధానములైనవే. అందరూ అందరే. ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అనడానికి ఏమాత్రం అవకాశంలేదు. ఆ మహాకావ్యమునుంచి ఏ ఒక్క పాత్రను మినహాయించినా రామాయణం అసంపూర్ణమే అవుతుంది.

శ్రీరామచంద్రుని సోదరులు ఒకరికి మించిన వారు మరొకరు. భ్రాతృభక్తి వారి జీవిత పరమాశయం. తండ్రి ఆజ్ఞ ప్రకారం పదునాలుగు సంవత్సరాలు వనవాసం చేసిన పితృభక్తి పరాయణుడు శ్రీరామచంద్రుడు. సమస్త రాజభోగాలను త్యజించి అన్నను అనుసరించిన భ్రాతృభక్తి పరాయణుడు లక్ష్మణుడు. సంక్రమించిన రాజ్యాన్ని స్వీకరించకుండా రామ పాదుకలకు పట్టాభిషేకంచేసి రామప్రతినిధిగా పదునాలుగు వత్సరాలు పరిపాలనచేసి శ్రీరాముడికి తిరిగి రాజ్యాన్ని అప్పగించిన త్యాగశీలి భరతుడు.

యువరాజ పదవిని స్వీకరించమని శ్రీరాముడు కోరునప్పటికి లక్ష్మణుడు అంగీకరించలేదు. శ్రీరామునికి సేవచేయడమే తన జీవిత లక్ష్యంగా పెట్టుకున్నాడు. అదేవిధముగా ఎవ్విధమైన అధికార పదవులను అభిలషించకుండా భరతుని అనుసరించడమే తన జీవిత ఆశయంగా స్వీకరించాడు మహాపరాక్రమశాలి, శత్రుశాసనుడగు శత్రుఘ్నుడు.

యుద్ధభూమిలో ' శక్తి ' అనే అస్త్రానికి గురియై లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు, నాగపాశానికి బద్ధుడై స్పృహతప్పిపడివున్నప్పుడు,

శ్రీరాముడు తమ్మునికోసం పడిన వేదన, బాధ ఎంతటివారినైనా కదలించి వేస్తుంది. లక్ష్మణుడు లేని రాజ్యం స్మశానంతో సమానంగా భావించి తానుకూడా యమసదనానికి లక్ష్మణునితో సహా వెళ్ళుతానని విలపిస్తాడు.

కబంధుడను రాక్షసుడు రామ లక్ష్మణులను బంధించినప్పుడు, అన్నయందు లక్ష్మణుడు చూపిన ప్రేమ, భక్తి అసాధారణమైనది. తనను కబంధునికి బలిగా యిచ్చి సీతాన్వేషణకై వెళ్లమని శ్రీరాముని ప్రాధేయపడుతాడు.

విరాధుడు అను రాక్షసుడు రామ లక్ష్మణులను తన భుజాల మీద పెట్టుకొని పారిపోతున్న సన్నివేశమును కళ్ళారా చూచి సీత పెద్దగా విలపిస్తూ తనను భక్షించి రామ లక్ష్మణులను వదలి వేయమని వేడుకుంటుంది. శ్రీరాముని సోదరులందరూ తమ తల్లులకన్నా సీతాదేవినే ఎక్కువగా ప్రేమించి గౌరవించేవారు.

హనుమంతుని ప్రభుభక్తిని గురించి, సుమిత్ర ధర్మనిష్ఠను గురించి వేరే చెప్పనవసరంలేదు. వారికి వారేసాటి.

శ్రీరామునిలాంటి అన్నను పొందిన లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ఎంతటి అదృష్టవంతులో; లక్ష్మణ, భరత, శత్రుఘ్నులవంటి తమ్ములను కలిగిన శ్రీరామచంద్రుడు కూడా అంతే అదృష్టవంతుడు. శ్రీరాముడికి సీతవంటి ఉత్తమురాలు సతిగా లభించడం కూడా అదృష్టమే.

ప్రపంచంలో పేరుప్రఖ్యాతులందుకున్న చక్రవర్తులు, రాజాధిరాజులు ఎందరో కలరు. కాని హనుమంతుడు లాంటి సేవకుడు, భృత్యుడు మాత్రం లభించడం దుర్లభం. ప్రభు సేవా తత్పరుడే గాక దౌత్యమును నెరపడంలో కూడ కడు సమర్థుడు. ఈ రెండు గుణగణాలు ఒకే వ్యక్తిలో వుండటం విశేషం. అటువంటి సర్వగుణ శక్తిసంపన్నుడు శ్రీరామునికి నమ్మినబంటు కావడం వల్లనే లంకా విజయం సులభతరమైనది.

వాల్మీకి మహర్షి చక్కటి ఆదర్శవంతమైన పాత్రలను సృష్టించి రామాయణ మహాకావ్యాన్ని ప్రపంచానికి ప్రసాదించాడు. అందులో ఆదర్శ ప్రభువు-శ్రీరామచంద్రుడు ; ఆదర్శ సోదరులు-లక్ష్మణ భరత శత్రుఘ్నులు ; ఆదర్శ సతి-సీత ; ఆదర్శ సేవకుడు-హనుమంతుడు ; ఆదర్శ మాతృమూర్తి-సుమిత్ర ; ఆదర్శ మిత్రుడు-సుగ్రీవుడు-అందరూ అందరే. చక్కటి ఆదర్శవంతులు. ఆదర్శం వారి జీవిత పరమాశయం.

ప్రతి వ్యక్తికి ఒక ఆదర్శం ఉండాలి. అది మంచిది, ఉత్తమమైనది. పదిమందికి ఉపయోగపడేదై వుండాలి. పరమోత్కృష్టమైన ఆదర్శాన్ని ఎంచుకోవాలి. అట్టి ఆదర్శంకోసం అంకితం కావాలి. పట్టుదలతో అవిరామంగా శ్రమించి దానిని సాధించాలి. ఆదర్శం లేకుండా ఏ పనీ సాధించబడదు. "ఆదర్శం గలవాడు వేయి తప్పులు చేస్తే, ఆదర్శం లేనివాడు యాభై వేల తప్పులు చేస్తాడు. కనుక ఆదర్శం వుండటం చాలా అవసరం" అని వివేకానంద ఎంతో దూరదృష్టితో చెబుతాడు. ఎన్నుకొనిన పరమోత్కృష్టమైన ఆదర్శాన్ని సాధించడాని కోసం త్యాగం చేయవలసి వస్తుంది.

త్యాగం మేడ మెట్లలో అత్యున్నతమైన ఆఖరి మెట్టు. అమిత ప్రియమైన వస్తువులను, సంపదను, రాజ్యాధికారములను, రాజ్యభోగములను నవ్వుతూ నవ్వుతూ, ఏమాత్రం సంకోచించకుండా యితరులకు యివ్వగలిగినవాడినే నిజమైన 'త్యాగి' అని అంటారు. అంతేకాదు తనను మనసారా ప్రేమించుచున్న వారిని, తాను మనసారా ప్రేమించేవారిని సహితం ధర్మ సంరక్షణార్థం అవసరమైతే త్యజించడానికి కూడా ఏమాత్రం వెనుకాడని వారిని కూడా నిజమైన 'త్యాగులు'గా భావించవచ్చును. "త్యాగాత్ శాంతిః" త్యాగము వలననే శాంతి చేకూరగలదు. శ్రీరామ సోదరులందరికి ఉగ్గుపాలతోనే త్యాగం అలవడింది. త్యాగం చేయడంలో ఒకరికి మించినవారు మరొకరు.

రామాయణ మహాకావ్యంలోని పాత్రలందరూ ధర్మ స్వరూపులే. ధర్మాన్ని అనుష్ఠించడమే వారి జీవిత లక్ష్యం. ధర్మమార్గాన నడవడమే వారి జీవిత ఆశయం. సత్యం ధర్మమునకు ఏ విధముగా ఆధారభూతమైనదో, రామాయణ పాత్రలకు కూడా సత్యం మూలాధారమైనది. సత్య-ధర్మాలే వారిని నడిపించాయి. వాటి మూలముననే వారు తమ జీవితాలను సరిదిద్దుకోగలిగారు. సకల శక్తులు కరతలామలకము లయినాయి. కష్టాలను సహించగల శక్తి వారికి లభించింది. ధైర్య సాహసాలను పొందగలిగారు. సర్వశక్తివంతులైనారు. దైవీశక్తిని కూడా సంపాదించగలిగారు. పరమ కిరాతకులైన రాక్షసులను తుద ముట్టించగలిగారు. దేవేంద్రాది దిక్పాలకులను నిస్తేజులుగా చేసిన లంకేశ్వరుని సహితం సంహరించ గలిగారు. అభేద్యమైన లంకాపురిని జయించగలిగారు. విజయలక్ష్మిని చేబట్టగలిగారు. ఆ సత్య-ధర్మాలే సీతాదేవిని కూడా రక్షించగలిగాయి.

రామాయణ సందేశం ప్రపంచానికి ఆదర్శమైన రోజున, రామాయణ పాత్రలు చేసిన త్యాగాలు మానవాళి ఆదర్శముగా గైకొనిన శుభదినాన, వారు చేబట్టిన ధర్మ పథమును సమాజం ఆదర్శముగా స్వీకరించిన పుణ్యదినాన, వారు నడచిన సత్యమార్గమున ప్రజానీకం నడచిన శుభ సమయాన కలియుగం కృత యుగముగా మారిపోతుంది. దేశం ధన ధాన్యాలతో విలసిల్లుతుంది. ప్రజలు సుఖ శాంతులతో జీవించుతారు. అప్పుడే రామరాజ్య వైభవాన్ని కళ్ళారా చూడగలుగుతాం, అనుభవిస్తాం. మహాత్మా గాంధీజీ కనిన కలలు ఆనాడు సఫలీకృత మవుతాయి.

రామాయణం మనకు యిచ్చే సందేశం, ఆదేశం 'సత్య, ధర్మ, త్యాగాలు' వాటిని అనుష్ఠించడమే మన జీవిత ఆశయం.

తరాలు తరలినా యుగాలు దొరలినా
ఉదాత్తత తరగని నిత్య నూతన గాథ రామాయణం.